# అభ్యుదయ

జూలై 1978

వెల రూపా

శ్రమ విజయం



శిల్పి: దేవీప్రసాద్ రాయచౌధురి

ప్రతికృతి: దశిక రామలింగేశ్వరరావు

# విషయసూచిక

అభ్యుదయ

సంచిక 7, సంపుటి 2 జూలై 1978 సాలు చందా, పది రూపాయలు

# అణ్వాస్త్ర సన్యాసం

టి. ప్రసన్నకుమార్

అగ్రరాజ్యాల
ఆత్మ తృప్తి కోసం
అల్ప దేశాలకు మాత్రం
అణ్వాస్త్ర సన్యాసం.
వాళ్ళ గుప్పెట
నిప్పు గోళాలు
నిజానికి కాపలా కాస్తూ
శాంతమ్మకు స్వాగతం
చెపుతాయట!
మనవి మాత్రం
మండి పడతాయట
మట్టి చేస్తాయట!
మా తారాపురంలో
వెన్నెలే కానీ
ఎండ లుండ వంటే
పెడ చెవిని పెట్టి
ప్రపంచపు పెద్దలు
సంగతి సందర్భాలు స్వయంగా
తెలుసుకోడానికి
తామే తొంగి చూడాలట ?!
కినుక కాలంలో
కునుకు తీసే స్నేహమా!
నమ్మ లేని నేస్తమా!
ఇంతకీ మన మధ్య ఏమిటి -
కరచాలనమా ?
శరచాలనమా ?

# పావలా

**కథానిక**

**మహీధర రామశాస్త్రి**

గత పదిహేను సంవత్సరాలుగ చూస్తున్నా. ఆ రోడ్డుపక్క ఆ చిన్న టీ దుకాణాన్ని అనుకొని, చదరపు గజం స్థలంలో, ఎండ తగలకుండా ఓ మాసికలు పడ్డ గొడుగు నీడన, ఆ ముసిలాడు అలా పనిచేస్తూనే వుంటాడు. చుట్టూ యిన్ని తోలు ముక్కలు, పాలిష్ సామాను, పాత చెప్పులు, కొన్ని కొత్తవి యిల్లా ... ముసిలాడికి, అరవై యేళ్లు పైన వుంటాయి. తెగిపోయిన చెప్పులుకుట్టడం, పాలిష్ చేయడం ఎక్కువగా చేస్తాడు. ఈ సిటీలో ఈ ముసిలాడి చేత, ఆది ఇచ్చి కొత్త చెప్పులు కుట్టించుకునేవాళ్లు ఎవరూ లేరు. అప్పుడప్పుడూ, ఫ్యాక్టరీ పనివాళ్లు కంపెనీ యిచ్చిన కొత్త బూట్లని ఈ ముసలాడి చేత నాజూకుగ, ఫాషన్‌గా మార్పించుకుంటారు.

ఈ పదిహేను సంవత్సరాల మధ్య సిటీలో, దేశంలో చాలా మార్పులే వచ్చాయి. ఈ రోడ్డు వెడల్పు రెండింతలయింది. రోడ్డు వెడల్పు పెంచినప్పుడల్లా, ఆ టీదుకాణం ఎదరికి జరుగుతూనే ఉంది. టీ దుకాణంతో, ఈముసలి మోచీ (జోళ్లుకుట్టేవాడు) ఎదరికి జరుగుతూనే వున్నాడు. బ్రతుకులో మాత్రం, ఒక్క అంగుళం ఎదరికి జరగలేక పోయాడు.

ఇతర వ్యాపారాల వాళ్లు లాభాలు గడించి, పెద్దవ్యాపారస్థులయిపోయారు. పాలు అమ్ముకునే వాళ్లు సహితం, నీళ్లు కలిపి గడించిన డబ్బుతో బంగారం ఉంగరాలు చేయించుకున్నారు. బియ్యం, పప్పులు అమ్ముకునే వాళ్లు అమ్మకం పన్నులు ఎగ్గొట్టిన డబ్బుతో పెంకుటిళ్లని డాబాలుగా మార్చుకున్నారు.

ఫ్యాక్టరీ వర్కర్ల జీతాలు మూడు సార్లు పెరిగాయి, యూనియన్ ధర్మమా అని. బోనసులు పెరిగాయి. బోగసు కంపినీలు పెరిగాయి. పావలా వస్తువు అర్థరూపాయి అయింది.

ఆ టీ దుకాణం, ఆ ముసలి మోచీలో మాత్రం మార్పు రాలేదు. ఆ రోడ్డు మీంచి వెడుతూ, ప్రతిరోజూ ఆ దుకాణాన్ని ఆ మోచీనీ చూస్తూనే వుంటాం. బూట్‌పాలీష్ చేస్తే పావలా పుచ్చుకుంటాడు ముసలి మోచీ. ఈ పావలా రేటు యీనాటిది కాదు. అరవై అయిదు నుంచీ పావలాయే. అన్నీ పెరిగిపోయాయి. ఇదెందుకు పెరగలేదు?

బొంబేలో ఫుట్ పాత్ మీద నలభై అయిదు రూపాయిల, వూలీ వూలీ చీర యీ సిటీ ఎంపోరియం లోని షో రూం ఆడ బొమ్మకి చుట్టబెట్టగానే, తొంభైకి పెరుగుతుంది. బోనసు అందుకున్న మనుషులు కరకరలాడే వంద నోట్లమధ్య నుంచి, ఓ నోటు విసరి, భార్యామణులకి కొనేస్తారు. పాలకొల్లులో పది పైసల నిమ్మకాయ, ఈ సిటీలో దిగగానే అర్థరూపాయి అయికూర్చుంటుంది. చెరకు రసంలో మంచుతోబాటు, ఈ నిమ్మకాయ చెక్క పిండించుకుని, గ్లాసు, మూడుపావలాలు పారేస్తారు.

ఈ మనుషులే —

మోచీ పాలీష్‌కి ముప్పై పైసలడిగితే

వందప్రశ్నలు వేసి, వెయ్యి విమర్శలు చేసి, "నీ నీళ్ల పాలిషికి ముక్కు చీవిడి క్రింకి ఇది చాలు!" అంటూ ఓ పావలా విసిరేసి విస విస పోతారు.

ఓ మారు ముసలి మోచీ దగ్గర, నా జోడు కుట్టించుకుంటూ కబుర్లలో పెట్టి అడిగితే, పైఅంశాలు మోచీయే చెప్పాడు. జాలి కలిగింది-కాని అశక్తుణ్ణి!

* * *

రేడియో పెడితే చాలు, ప్రభుత్వం ముసలి మోచీ లాంటి వాళ్ల కోసం, బ్యాంకుల ద్వారా ఎంత సేవ చేస్తున్నదీ చెవులు తడకలు కట్టేలా ఒకటే మోత! సంవత్సరాలుగా ప్రసారాల ప్రచారం వింటూనే వున్నా. సంవత్సరాలుగా, ముసలి మోచీని చూస్తూ నేవున్నా. మోచీకి రేడియో లేదు. పనిలేనప్పుడు, ఎదర కిళ్ళీకొట్టు రేడియోలో వింటాడు, యీ ప్రచారం. కానీ ఆ సేవ తనకెలా అందడంలేదో ఎప్పటికీ అర్థంకాని విషయం.

* * *

ఈ టీమకాణానికి అరమైలుదూరంలో ఓవర్‌బ్రిడ్జి క్రింద కొన్ని గుడిసెలున్నాయి. ఆ గుడిసెల్లో ఒకటి మోచీది. ఓ పాతిక గుడిసెలుంటాయి. ఆ గుడిసెలు, వాటిలోని మనుషుల జీవితాలు చూస్తే, ఈ దేశంలో అట్టడుగు మనిషి నాగరికత అర్థమవుతుంది కానీ వాళ్ళూ మనుషులే. వాళ్లకి భావి మీద ఎంతో ఆశ, నమ్మకం ఉన్నాయి. ఏదో ఒక్క రోజున, ఏదో మార్పు కలిగి, ఇంత కన్న సుఖంగా బతుకుతాం అని అనుకుంటాయి ఆ ఆత్మలు. మోచీ గుడిసె చూద్దాం అందులో ఈత చాప మీద, ఓ ముసల్ది. కూర్చుని, చాంతాడు పేనుతూంది. దాని కళ్లు కనిపించవు. అది మోచీ భార్య. గుడిసె ముందు కట్లు జారిపోయిన నులక మంచం మీద, వయసులోవున్న ఓ ఆడది ఒళ్ళో పిల్లాడికి పాలిస్తూంది. జాకెట్టు లేదు. అది మోచీ కోడలు. కొడుకు కార్ఖానాలో రోజు కూలికి పని

# ప్రకృతిలో కర్రీ

చాగంటి రామారావు

ఉదయిస్తున్న చందమామ
మెరుస్తున్న బంగారపు ముద్దలాగుంటే
కురియ బోతున్న వెన్నెల
బంగారం రంగులో ఉంటు దని
ఊహించిన అమాయకపు కవికి
కాస్సేపట్లోనే
బంగారప్పూత కాస్తా కరిగిపోయి
తెల్లని వెండి ముద్దలా
వెన్నెల కురిపిస్తూ కనిపిస్తే
అనుకున్నా "డి వేంకర్రీరా?" అని.

మిసుకు మిసుకు కాంతిలో
వెన్నెల పాలసంగును చూసి
చందమామ వెండితనపు
సామ్రాజ్యాన్ని ఆభినందించాడు
బంగారం పోయినా
వెండేనా మిగిలిందని
ఆనందించాడు
మర్నాటి ఉదయంలో
మకిలి పట్టి అంచు విరిగి
వెలసి పోయిన అల్యూమినియం
పళ్ళెంలా వెలవెల బోతుంటే
చందమామను చూసి
మరో మారనుకున్నాడు
"ప్రకృతిలో కూడా కర్రీయేనా?" అని.

చేస్తున్నాడు. నాలుగు రూపాయిలు సంపాదిస్తాడు. ఇంటికి నాలుగు పైసలివ్వడు తోవలోనే తినేసి, తాగేసి తూలుతూ వచ్చేస్తాడు, భార్యకోసం. రాలేనప్పుడు ఎవరయినా మోసు కొస్తారు. చుక్కల ఆకాశం క్రింద, కుక్కి మంచంలో యిల్లాలి శరీరాన్ని అల్లుకుని పడుకుంటాడు.

సూర్యుడు దిగిపోయాడు. రైలు కట్టపక్క సిగ్నలు దీపాలు వెలిగాయి. గుడిసె పక్కని, ఆరు బయట, మూడు రాళ్ల పొయ్యిక్రింద గాలికి రెపరెప లాడుతున్న మంట! పైని నీళ్ల గిన్నె కాగుతూంది. అందులోకి నూకలు లేవు! వాటిని తేవాల్సిన మనుషులూ రావడం లేదు. మంటకేసి చూస్తూ కూర్చుంది, వయసులోని ఇల్లాలు. బిడ్డడు పాలు పీకుతూనే వున్నాడు.

మోచీ రావడం లేదు. మోచీ కొడుకు రావడం లేదు.

పొయ్యి క్రింద మంట, కడుపులో మంట!

అటూ యిటూ ఆసరాగా పట్టుకుని, పడిపోకుండా నడిపించు కుంటూ, నడవనప్పుడు, గంజీ కావడి పడుతూ, మోసుకొచ్చి గుడిసె ముందు పారేశారు, మోచీ కొడుకుని. ఆ రోజు ఓవర్ టైం చేసి, ఓవర్ వేజస్ గడించాడు; ఓవర్ లోడు మీద వచ్చాడు. రాలేదు! తీసుకురాబడ్డాడు.

ఈ ఆగమనం, ఆగడం ఆ ఇల్లాలిని కదిలించ లేదు! ఓసారి చూసి తిరిగి చూపును మంటపైపే త్రిప్పింది. కానీ, కడుపులో మంట - గుండెలకి పాకి, గుండెలు మండుతున్నాయి.

హాయిగ నేలమీద, పాదుషాలా కాలి మీద కాలేసుకుని, బాసింపట్టు వేసుకున్నాడు. రెండు చేతులతోనూ, పై మోకాలి మడతని బిగించి పట్టుకుని, అవ్యక్తనీయమైన ఆనందం అనుభవిస్తున్నాడు. చూపులు బిడ్డడికి పాలిస్తున్న యిల్లాలుమీద పడ్డాయి. బిడ్డ మీద పడ్డాయి. పాలిండ్ల మీద పడ్డాయి. చటుక్కున తల త్రిప్పి పొయ్యిక్రింద మంటని చూశాడు. "ఓస్! నాలోవున్న మంట కన్నా గొప్పదేటీ మంట!?" అనుకున్నాడేమో, ఆకాశంకేసి చూశాడు - "ఇవేటీ చుక్కలింత కిందికి దిగిపోయినాయి"? అనుకున్నాడు - తనలో చుక్క తలకెక్కి పోయిందని తెలియక!

ఆ పోజులోనే విలాసంగా కాలూపుకుంటూ, "ఒడ్డించేత్తావేటే?" అన్నాడు.

గిన్నెలో నీళ్లు పొంగి పొర్లి పొయ్యిక్రింద మంట చల్లారింది. ఇల్లాలి గుండెలో మంట, యీ ప్రశ్నకి భగభగ లాడింది. ధుమధుమ లాడుతూ చూసింది భర్తని. భర్త అహం దెబ్బతింది, ఈ అలక్ష్యానికి. ఓకుప్పిగంతుగెంతి మంచంమీద పడ్డాడు. రానున్న పరిస్థితి గ్రహించిన దానిలా, బిడ్డని క్రిందకు దింపి, సర్దుకుంది. భర్త సరాసరి దాడి ప్రారంభించే సరికి, ఎదుర్కోక తప్పలేదు. బిడ్డ యేడుపు - పీకిపీకి పీల్చుకుందుకు లేకుండా పోయిందని. ఇల్లాలి ఏడుపు పెనుగు లాటకి తట్టుకోలేక - గుడిసెలో ముసల్ది, "ఇదేమి గాదారంరా బగవంతుడా?" అని రాగయుక్తంగా, సాగదీసిందా మాటని.

పెనుగులాట పెద్దదయింది. ఇల్లాలు గుడిసె చుట్టూ రెండు సార్లు పరుగు పెట్టింది. నులక మంచం తగిలి పడిపోయింది. ఉడుకు మోత్తనంతో, ఆ మంచాన్ని భర్త మీదకి నెట్టింది. ఆదెబ్బకి రోషం పెరిగింది. రెచ్చిపోయాడు.

ఆడదాని జుట్టుపట్టుకు లాగి, వంగదీసి రెండుగుద్దేశు. "దండ వెడతా! కొట్టకు!" అంటూ నిస్సహాయంగా ప్రాధేయ పడుతున్న ఆలి కన్నీటి బుగ్గని పట్టు కొని కరిచి వదలి పెట్టాడు భర్త.

ఓవర్‌బ్రిడ్జి క్రిందనుంచి నూకలు సంచీతో వస్తున్నాడు మోచీ ఈదృశ్యం చూసి, బాణంలా దూసు కొచ్చాడు. కొడుకుని లాగి లెంపకాయ కొట్టాడు. దాంతో దిమ్మతిరిగికూలబడ్డాడు.

నూకల సంచీ కోడలు చేతికిచ్చాడు. దిగజారి పోయిన మంటని, ఎగ దోసి, ఎసట్లో నూకలుపోసి, కన్నీటి చారికలని తుడుచుకుని ఉద్వేగాన్ని దిగమింగుతూ వంటచేసూంది.

మోచీ బిడ్డడిని చేతుల మీదకి తీసుకున్నాడు.

"ఎదవ, తాగుమోతెదవా! ఆడకూతుర్ని కొడతావ్రా? యదవ నా కొడకా! అణాకాసుకి పనికి రావు! అవలచ్చనాల యదవ! పావలా పరక బ్రతుకుల్రా మనయి. మన బుద్దులు మారక పోతే మన బతుకులింతేరా యదవ! తాగి సెడి పోయేవాణ్ణి ఎవడు బాగుసేయగల్డురా? ఆ వచ్చే లచ్చిమి ఎనక్కే ఎడుతుంది. ఈమద్దిసేల ఓబాబు పావలా పాలీసుకి, సిల్లర లేదంటే. దయదల్చి రూపాయిచ్చాడు. ఎంతో సంబర పడ్డా! అంతట్లోకి వచ్చేశాడు పోలీసు పొట్టిపంతులు. ఎన్నిసార్లు చెప్పాల్రా నిన్నికాడ దుకాణాలెట్టద్దని? అంటూ తగులుకున్నాడు. ఆడి కాఫీకి రూపాయి సేతులో పడేదాకా విడల్లేదు! కాపీకి డబ్బు లివ్వంగానే, నా దుకానం టాపిక్కకడ్డం లేకుండా పోయింది! అణ్ణానాల్సింది లేదురా! మన బుద్దుల్ని బట్టే మనబ్రతుకు లేడుత్తాయి! పావలాపరక బతుకులు మనయి! కాపీకి రూపాయి బతుకులు లాళ్లయి ఇదింతే!".

రైలు పట్టాల మీంచి, మైలు రంకె వేసుకుంటూ వెళ్లిపోతూంది! మోచీ మనవడికి రైలు బండిని చేత్తో చూపిస్తూ ఆడిసున్నాడు.

ఇంజను ... ఎయిర్ కండిషన్డ్ కార్ ... ఫస్టుక్లాసు పెట్టెలు ... రెస్టారెంట్ కార్ ... అరెమ్మెన్ ... రిజర్వేషన్ పెట్టెలు ... టూటైర్ త్రీటైర్ ... సెకండు క్లాస్ ... బ్రేక్ వాన్ ... బండి వెళ్లి పోయింది.

చిగురున ఎర్రదీపం "తరగతులూ తరహాలూ తప్పని సరి!" అని హెచ్చరిస్తూ.

# పెదాలు

## దేవరాజు మహారాజు

1

నా పెదాలు విప్పితే
పదాలు రాలుతాయి
ఈ కలం పెదాలు కలిసి
అక్షరాలు గిలుకుతాయ్
కలం పెదాలు విడిపోయినా
నావి అంటుకుపోయినా
వల్లని మృత్యువు తాగినంత
మౌనం! ... సిరాలాగా
ఎర్రని జీవం తాగినంత
భయం!...రక్తంలాగా-
రక్తం, సిరా ప్రవహిస్తే,
వాటి మీద ప్రయాణం
చేస్తూ పడవలు
మాటలూ . . అక్షరాలూ

2

పెదాలు,
పదాల కలయికలు—
పదాలు,
హృదయ స్పందనలు.
స్పందనలు,
పెదాల లోయల్లోంచి
నిరంతరం పారుతున్న
జన చైతన్య జీవనదులు.
జీవ నదులు,
ఎర్రగా ఘోషిస్తున్న
గుడిసెల గుండెల
ఆవిర్భూతాలు-
కొన్నే పదాలు
కోట్ల పెదాల ఘర్షణలు.

# "బాగా, బాగా చదవాలి"
# యువ రచయితలకు గోర్కీ సలహా

వె. పొలెవొయ్‌కి రాసిన లేఖ నుంచి

మీ స్కెచ్‌లలో "భాష చాలఘాటుగా సహజంగా, వాక్చిత్రాలతో నిండి వుంటుంది" అంటూ కామ్రేడ్ యార్ ట్సేవ్ వ్రాసేరు. అదేమిటో చూద్దాం.

మొట్ట మొదలుగా - సంభాషణల లోని భాషని పక్కకి పెట్టేద్దాం. ఏమూ-వాటిలో కనిపించే ఘాటు, సహజత్వం మీవి కావు. వాటిలో మీరు వుపయోగించి నది అఘోలోకపు యాస మాటలూ, సంకేతాలూ, పరిభాషలూను. ఇంక మీ భాషలో కనిపించే వర్ణనలలో, "అలాడ్జి ఇల్లు రాతిపుర్రెలావుంది." అని వ్రాసేరు. దానిలో విస్పష్టత లేదు. పుర్రె అనేసరికి ఇంచుమించు గుండ్రంగా వున్న వస్తువు జ్ఞాపకం వస్తుంది. మీరు "లాడ్జి ఇల్లు పుర్రెలా వుంది" అన్నప్పుడు మీ అలోచనలలో ఆ ఇంట్లోవున్న మాళిగ గదులో, అటకల గదులో మెదులు తున్నాయి. అంటే పాఠకుడికి మీరు చేసే సూచన ఏమిటి? దానిపై ఆకారం కాదు చూడ వలసినది. లోపలి ఏర్పాట్లు చూడండి అని. అర్థమయిందా? తరవాత వాక్యాలను దానిలోని మొదటి పదం చివరి అక్షరం రెండో పదం మొదటి అక్షరం కలుస్తే ఏ బూతు అర్థమో వచ్చే మరో పదం ఏర్పడే విధానంలో వ్రాయ కండి. ఒకరినొకరు బోల్తా కొట్టించు కొనేందుకు బడి పిల్లలు అట్లాంటి పనులు చేస్తుంటారు.

"దీపం బల్బులు పచ్చగా కుక్క కళ్ల లా వున్నాయి." - ఇదే పద చిత్రాన్ని 13వ, 16వ పేజీలు రెంటిలోనూ కూడా వాడేరు. "పచ్చని గాలిని అవి మసకగా వడకడుతున్నాయి" అనేది ఒక ప్రయోగం. మనం వడకట్టడం ఒక వస్తువు గుండాచేస్తాం. ఆ వడకట్టడం నెమ్మదిగా జరగొచ్చు. వేగంగా జరగొచ్చు. కాని, మసకగా వడకట్టడం వుండదు. ఇక్కడ మీ వుద్దేశం ఏమిటో ఎవ్వరికీ బోధ పడదు. అదీగాక, దీపం బల్బులు ఎల్లా వడకడతాయి? వాటిగుండా గాలి ప్రస రిస్తుందా? తరవాత దీపం బల్బులు పచ్చగా వున్నాయని వ్రాస్తే ఆ వెలు తురు పచ్చగా వుందని అర్థమే కద. ఒకే భావాన్ని అంత దగ్గరలో మళ్లీ మళ్లీ చెప్పకూడదు, విసుగేస్తుంది.

మీరు తరుచు మాటల్ని వికృతం చేస్తున్నారు. "పుల్లు" కాదు పులులు. ఘూంద్రు కాదు. గాంద్రు. గాండ్రించు అనేది క్రియను తెలుపుతుంది. "చెవులకు పదును పెట్టడం" - అదేమిటి? ఆవేమన్నా పెన్సిళ్లా? బహుశా అదే మాదిరి వినిపించే ఉక్రేనియన్ పదాన్ని వుప యోగించలేదు కద. ఆ మాటకు అర్థం తెరుచుకొనడం లెండి. "ఉపయో గించడం చేసి వుండ వలసింది" అని వ్రాసేరు. "ఉపయోగించి వుండ వలసింది" అని వ్రాయాలి. "ఆ మనిషి

నేలను నాకేడు. గోళ్లతో గోకి తీసుకున్నాడు. ముద్దెట్టుకున్నాడు. కావలించుకున్నాడు'' అని వ్రాసేరు. అతడు అవన్నీ చేసే పుండొచ్చు, కాని మీరు వర్ణించిన క్రమంలో చెయ్యడు. ఆ వర్ణించిన పద్ధతి చూస్తే ఆ మనిషి నిజంగా అల్లా చెశాడనిపించదు.

ఇదంతా కోడిగుడ్డుకి వెంట్రుకలు తీయడం అనుకోకండి. ఇవేవో చిన్న విషయాలు కావు, శిల్పానికి సంబంధించినవి. వ్రడంగి, కమ్మరిలాగ రచయితకు కూడా తాను వుపయోగంలో పెట్టే ముడిసరుకు గురించి — భాష, శబ్దాలు గురించి— మంచి పరిజ్ఞానం వుండాలి. లేనప్పుడు అతడు తన భావాల్ని, అనుభవాల్ని, ఇంద్రియానుభూతుల్ని చిత్రించ లేడు. వాటికి రూపం ఇవ్వలేడు. పాత్రలను సృష్టించలేడు. మన పూర్వపు కవులలాగ యువ రచయితలైన మీరు కూడా రచనా శిల్పాన్ని స్వాధీనంలో పెట్టుకోవాలి. వారికి తెలిసినవన్నీ, వారి కన్న బాగా తెలిసి వుండాలి. నూతన జీవితాన్ని నిర్మించే బాధ్యతను చరిత్ర మీ చేతుల్లో పెట్టింది. అంటే సాహిత్యాన్ని కూడా మీరు పునరుజ్జీవింప చెయ్యాలి. ఏదో ఓ చిన్న పని చేసి వీపులు తట్టుకోనక్కర్లేదు. మహత్తర విజయాలు సాధించవలసిన బాధ్యత మీ మీద వుంది.

మీరు అధ్యయనం చెయ్యాలి. బద్ధకం కూడదు. ప్రపంచంలోని మంచి వాటినన్నిటినీ, ప్రతిఒక్క మాదిరి శిల్పాన్నీ, సర్వ ప్రథమంగా రచనా శిల్పాన్ని మునివేళ్ల మీదికి తెచ్చుకోవాలి. అదో పెద్ద కష్టం కాదు. శత్రువర్గం మిమ్మల్ని తాత్వికంగా తప్పుదారి పట్టిస్తారేమోనని భయపడొద్దు. సరియైన అవగాహన లేకపోతేనే అటువంటి భయం . . .

క్రామేడ్ పొలెవాయ్‌లో శిల్పంరీత్యా పొరపాట్లున్నా, నిజంగా ప్రతిభగల యువకుడు. బాగా చదవాలి. బాగా, బాగా చదవాలి.

మాక్సిం గోర్కీ

30 మార్చి 1928
సోరెంటో (ఇటలీ)

## ఓటు . . . . వెంపలి వెంకట శివప్రసాద్

"మా పార్టీ మంచిది
మా ఆశయాలు మంచివి
మాకోటియ్యండి''
చెబుతున్నాడొకడు.

''కాదు మా పార్టీ మంచిది''
ఇంకోడి వాదన.
''వాళ్ళను నమ్మకండి
వాళ్ళిద్దరూ
తోడు దొంగలు''
మరోడి నివేదన.

''అదంతా నాకు తెల్దు.
నోటిచ్చినోడికే నా ఓటు''
ఇదీ వీడి నిర్ణయం.

పై వాళ్ళతో పెద్ద
ప్రమాదం లేదు.
ముందు
వీడ్ని చూడండి.
ఓటు
విలువేమిటో
వీడికి తెలియపర్చండి.

# థీమ్ దొరికింది

**కథానిక**

**జి. నరసింహమూర్తి**

రొటీన్ థీమ్స్‌తో రచయిత రంగా రావుకి మొఖం మొత్తింది. చైతన్యవంత మైన రచనలు కావాలనే వాళ్లలో రంగా రావు కూడా ఒకడు. సామాజిక ప్రేరణాత్మకమైన రచనలు రావా లంటాడు. ప్రేమకథల్నీ, పచ్చి సెక్సు కథల్నీ సమాధి చేయమంటాడు. ఏదో అల్లిబిల్లి గారడీ నవల గిలికేసి పాఠకుల మొఖాన కొట్టొద్దంటాడు.

'రచనలో సమాజం కనపడాలి. ఆర్టిస్టులా సగటు మనిషిని చిత్రించాలి. సామాన్య మానవుని దైనందిన కష్ట సుఖాలకు రచన అద్దం పట్టాలి. పేదవాళ్లను ప్రజల కళ్ళముందు పెట్టి దోపిడీ వర్గాలను అణగదొక్కాలి' అన్న భావన అతనిలో వుంది.

అణగదొక్క బడుతున్న వర్గాల్లో రచనల ద్వారా చైతన్యం తేవచ్చుననీ, పీడిత వర్గాన్ని ఎదురు తిరగమని ప్రేరేపించ వచ్చుననీ, రచయితలే సంఘం లోని కల్మషాన్ని కడిగి పారేయగల దిట్టలనీ, బూర్జువాలకు సమాధులు అవ్వగలిగే ఉద్వేగమూర్తులు వారేనని నమ్ముతాడు.

దేశాన్ని ఒక్కుమ్మడిగా కదలించి విప్లవం లేవదీయడానికి రచయిత కలానికున్న శక్తి ప్రపంచంలో మరి దేనికీ లేదంటాడు. న్యూక్లియర్ బాంబుల్ని తయారుచేస్తున్న వాళ్ళని కలం పోటుతో చంపి పారేయవచ్చు నంటాడు.

నిర్భయంగా, నిర్మొగమాటంగా, నిష్పక్షపాతంగా ఒక రచయిత అభ్యుదయ భావాల్ని పత్రికలు స్వీకరించి ప్రజల ముందుంచ గలిగినట్టయితే దేశం చైతన్యవంతమయ్యి ఉండేదనీ, ప్రగతి సాధించడానికి యిన్ని సంవత్సరాలు నాశనం చేసుకోనవసరం లేకుండా పోయేదనీ యెప్పటికైనా గొంతెత్తి చెప్పాలని యెదురుచూస్తున్నాడు.

ఇక లాభం లేదు. యేదో రాయాలి. రాసితీరాలి. రాద్దామని కూర్చున్నాడు. థీమ్‌కోసం గింజుకులాడింది మెదడు. అందులో కొస్తున్నవల్లా పెరుగుతున్న ధరలు - విరుగుతున్న కోరికలు - కరుగుతున్న కలలు -

ఇవనీ, యింతకు ముందెంత మందో రాసి పారేసినవే!

పాత సరకు పట్టుకు పీకులాడితే వెరైటీ కోరే పత్రికలు తన కష్టం అర్థం చేసుకోకుండా మొదటి రెండు లైన్లూ, చదివి ముగింపే మయుటాదో కనిపెట్టేసి చప్పరించి ఊరుకుంటాయి. తిరుగు టపా పేడితే సరేసరి, లేకపోతే వందలాది రచనల్లోకి తనదీ వెళ్లి తగలడి పోవాల్సిందే!

రచయిత పాఠకుల సైకాలజీ తెలుసుకోగలడు గాని పత్రికల వాళ్ల సైకా

లటీ అంతు దొరకదు. పలుకుబడొచ్చిన తర్వాత పత్రికల వాళ్లమీద ప్రత్యేక రచన ఒకటి ఎందుకు చేయకూడదా అనుకుంటున్నాడు తాను.

రచయిత ఊహించి రాసిందాంట్లో ఊహ మిగుల్తాది. సహజత్వం చస్తాది. అది కేవలం శవానికి స్నోలురాసి సెంట్లు పూసినట్లే. కనుక కళ్ళార చూసిన సంఘటన కాగితం మీద పెడితే పాఠకుల హృదయాల్లో హత్తుకుపోతాది.

మంచి ప్లాటు కావాలంటే రోడ్లంటా, సందులంటా, గొందులంటా, వెళ్లాల్సిందే! మురికి పేటల్లోనూ, మురికి మనుషుల్లోనూ, శ్రమజీవుల్లోనూ దానికోసం వెదకాల్సిందే!

మాక్సిం గోర్కీ, టాల్‌స్టాయ్, ప్రేమ్‌చంద్ లాంటి వాళ్లేం చేశారు?

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

బయట ఎండలు మండిపోతున్నాయి. యింట్లో కూర్చోవాలన్నా యిబ్బందిగానే వుంది. యేదో అనుభవంలోకి తెచ్చుకుంటే గాని అది కాగితం మీదకెక్కదు.

పైజమా, లాల్చీ వేసుకున్నాడు. రాయాలన్న ఆరాటం కొద్దీ యింట్లోంచి బయటకు పడ్డాడు.

ఒకటే యెండ! – తప్పదు. భరించాలి. రచయిత ఆ మాత్రం శ్రమతీసుకుంటేనే ఒక ఆర్టికల్ తయారవుతుంది మరి. అందుకనే అక్కడో కూల్‌డ్రింక్, అక్కడో సోడా, అక్కడో లెమన్‌జూస్ తాగుతూ చెమట్లు కక్కుతూ తిరిగాడు. ఎక్కడా యేమీ దొరకలేదు.

అబ్బే–అదీ కాదు. యిదీ కాదు. అసలు మంచి థీమ్ కావాలంటే కూలినాలి చేసుకుంటున్న వాళ్ల గుడిసెల వేపు వెళ్ళాల్సిందే! ఆ థీమ్స్ మీదే పాఠకులు మక్కువ చూపుతున్నారు మరి!

అటే నడిచాడు. వెళ్తుంటే గుడిసెలు దగ్గరయ్యేకొలదీ రోడ్డంట మనుషుల రద్దీ, కోలాహలమూ యెక్కువగా కనబడుతుంది. కొందరు గబగబా గుడిసెల వేపు పరుగులెడుతున్నారు.

రంగారావుకిదేమిటో అర్థం కాలేదు. మరి కాస్త ముందుకు నడిచేసరికి హోరు – గోల – కేకలు – అరుపులు.

అతనిలో ఉత్కంఠ కెరటంలా విరుచుకు పడింది. ఇంతసేపటినుంచీ పడ్డా కష్టమూ, అలసటా, నీరసమూ యెగిరిపోయాయి. గబగబా ముందుకి నడిచాడు.

అగ్నిజ్వాలలు ఆకాశంలో కెళ్లడానికి నృత్యం చేస్తున్నాయి. యాభై గుడిసెల్ని చుట్టుముట్టి శివతాండవంతో చిర్రెత్తిపోతోంది అగ్ని.

ఆర్పడానికి అంతా శక్తి కొద్దీ శ్రమపడుతున్నారు. ఒక్కుమ్మడిగా అగ్గితో పోరాటంచేస్తున్నారు. మంటల్లోచిక్కడిపోయిన పిల్లలఏడుపులు భయంకరంగా వినిపిస్తున్నాయి. గుడిసెల్లోంచి తప్పించుకోలేని కొందరి ఏడుపులూ, ఆర్తనాదాలతో గగ్గోలుగా ఉంది.

ప్రాణాల్ని లెక్కచేయకుండా ప్రతి మనిషీ తోటి మనుషుల్ని బతికించడానికి మంటల్ని అదుపులో పెటడానికి యేకధాటిగా పనిచేస్తున్నాడు.

రంగారావుకి ఆ దృశ్యం పూర్తిగా కనబడటం లేదు. ఇంకా ముందుకెళ్తే తన పని జరగదు. గబగబా అక్కడున్న ఓ చిన్న మట్టిదిబ్బెక్కాడు. ఇప్పుడు ముందుకంటే బాగా కనబడుతోంది. అప్పటివరకూ తన పడ్డాబాధ

కథానిక యిడ్డిష్

# ఆడదాని ఆగ్రహం

## ఐసాక్ లోయెబ్ పెరెజ్

యిడ్డిష్ యూదుల సాహిత్యభాష. కథకుడు యిడ్డిష్ భాషారంగంలో సుప్రసిద్ధుడు. జననం - **1851**; మరణం - **1915**. తెనిగింపు, గాంధి.

ఆ చిన్న గది పేదరికంలా, మసకగా వుంది. పడిపోవటానికి సిద్ధంగా వున్న ఇంటి కప్పునుండి ఒక కొక్కెం వేలాడుతోంది. ఇదివరకు దాన్ని లాంతరు తగిలించ టానికి ఉపయోగించి వుంటారు. పొయ్యికి దగ్గరగా అంచూడిపోయిన వంట పాత్ర బోర్లించి వుంది. దాని పక్కనే ఒక విరిగిన గరిటె పడివుంది.

సామానులతో గదంతా చిందరవందరగా, ఇరుకుగా వుంది. ఆగదిలోనే ఒక మంచమూ, దానిపైన గలీబుల్లేని దిళ్లూ వున్నాయి. అందులోనే ఒక ఊయల. దానిలో నిద్ర పోతున్న ఒక పసిపాప. దాని పసుపు పచ్చటి తల అసహజంగా లావుగావుంది. మరో పక్క ఒక పెద్ద బోషాణం వుంది. దాని నిండా ఏదో పిచ్చి సామానుంది గాని దానిలో విలువైన వస్తువు ఒక్కటీలేదు. ఆ గది లోనే ఒక టేబిలూ, మూడు కుర్చీలూ వున్నాయి ఆ గదిలోనే ఒక పగిలిన కబర్డుండ్. ఒక మూల రెండు కుండలు న్నాయి. అందులో ఒక దానిలో మంచి నీళ్లు, మరో దానిలో వాడకం నీళ్లు వున్నాయి. మరో మూల ఒక పారా, పండ్లకోల వున్నాయి. ఆ గదిలో సూది మొన మోపేంత చోటు లేదనే విషయం ఈపాటికి మీకర్థమై వుండాలి.

అయినా ఆమె, అతడూ యిద్దరూ ఆ గదిలో వున్నారు.

ఆమె, ఒకయూదు. మధ్య వయస్కురాలు అమెచేతుల్లో ఒక సంచిని కుట్టుతూ కాలితో ఉయ్యాల ఊపుతూ అతడు చదువుతున్న మతగ్రంథం 'తాల్ముడ్' వింటోంది. అతడు, అటూ ఇటూ, ఊగుతూ తన్మయత్వంతో ఆలాపిస్తున్నాడు. కొన్ని మాటల్ని మింగేస్తూ, మరికొన్ని మాటల్ని బిగ్గరగా చదువుతున్నాడు. కొన్నిఒక్కొక్క పదం దగ్గర ఆగి, దాన్ని విడరించి చెబుతున్నాడు. కొన్నిమాటల్నిగబగబాచదివేస్తున్నాడు. ఒక్కక్షణం కూడా నిశ్శబ్దంగా లేడు. అతను తన జేబులోనుంచి వెలిసిన ఎర్ర రుమాలు తీసి ముక్కునీ, కనుబొమల్నీ తుడుచుకొని మళ్ళీ దాన్ని జేబులో కుక్కుకొన్నాడు. తర్వాత తన చెవులకున్న పోగుల్ని ఆడిస్తూ, సగంనెరసిన గడ్డాన్ని సవరించుకొంటూ చదువు తున్నాడు. మళ్ళీ జేబురుమాలు తీసి ముక్కు తుడుచుకొంటున్నాడు. అప్పుడప్పుడూ ఎడమ ముక్కుపుటం మీద బొటనవేలుంచి, కుడివైపుకు చీదుతున్నాడు. మధ్యమధ్యలో ముక్కు పొడుం దట్టించి, బిగ్గరగా గొంతెత్తి చదువుతున్నాడు. అతడు కూర్చున్న కుర్చీ కిరకిర లాడుతోంది. టేబులు ఊగిన లాడుతోంది.

అయినా పసిపిల్ల మేల్కోలేదు. దాని కాచప్పుళ్లు అలవాటయి పోయాయి.

ఆమె, అతని భార్య వయసు కంటే ముందే ముసలి తనంతో వడిలి పోయినట్టుంది. అమెభర్తవంకకన్నా ర్వకుండా

గట్టెక్కినట్టుంది.

ఆడవాళ్ళు కాలిపోయిన చీరల్ని అవతల పారేసి లంగాలతోనూ, జాకెట్లతోనూ, అంత మందిలోనూ ఘొల్లున యేడుస్తూ మతిపోయినట్టు తిరుగుతున్నారు. తల్లడిల్లిపోతున్నారు. తమ బిడ్డల్ని బతికించమని అర్థిస్తున్నారు.

గుడిసెలన్నీ భగభగా మండిపోతున్నాయి. విప్లవం లేవదీసిన వేలాది కష్టజీవుల్ని కాల్చిపారేసి పెట్రోలు పోసి వెలిగించినట్టుంది రంగారావుకి ఆ ఘటన.

హోరుగాలి, యెటూ వెళ్ళడానికి వీల్లేకుండా అటూయిటూ మంటలు రివ్వుమంటూ సుడులు తిరుగుతున్నాయి.

పేద ప్రజల గుడిసెలన్నీ మసి! వాళ్ళెంత కాలనుంచో సంపాదించుకున్న చిరుగుల పాతలూ, చిల్లర సామానులూ బూడిద!

రేపట్నుంచి నిలువ నీడ లేకుండా ఆకలి చావులు చచ్చేకంటె ఆ మంటల్లో దూకి చావడానికి ముందు కురుకుతున్నారు. కొందరు అక్కడున్న వాళ్ళలో కొందరు. వాళ్ళని గట్టిగా పట్టుకొని ఓదార్చుతూ వెనక్కి తీసుకుపోతున్నారు.

ఆ ప్రదేశమంతా భీభత్సంగా తయారయింది.

యేడుపులు – హాహాకారాలు – ఆర్తనాదాలు.

రంగారావు మాత్రం చేతులు కట్టుకొని శ్రద్ధగా ఆ సంఘటన గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

# గవేషణ

## చెల్లూరి సీతారాజేశ్వరరావు

ఏమిటి నువ్వు చెప్పేది పాపా?
అంతలోనే నీకు మైమరపా?
కోయిల కూస్తూందనా?
తువ్వాయి గంతు లేస్తూందనా?
పావురం ఎగిరిపోతోందనా?
నీ పాల నవ్వుల భాష తెలీదు
మురిపాల తేరింతాలు తెలీవు
ఆరు నొక్కరాగం అర్థం కాదు.
స్వార్థం నా వూపిరి.
పాపం నాస్నేహం
వేట నా ఆట.
ఆకాశంలో ఎగిరే వెండి మబ్బు
వాన కురిపిసుందని, చల్లని
చినుకుల్లో పరుగు తీయాలనుకోకు,
భవితలో వద్దన్నా వరించే
కన్నీటి వానుంది.
బాల్యమే స్వర్ణయుగం
ఆ కల అమూల్యం.

చూస్తూ అతను చదివేది జాగ్రత్తగా వింటోంది తన భర్త దైవసంబంధమైన విషయాల్లో గొప్ప పండితుడు, ఈ లోకానికి సంబంధించిన వాడు మాత్రం కాదు. అనుకొంటూ ఆమె అప్పుడప్పుడూ నిట్టూరుస్తోంది.

'రెండు లోకాలకీ అర్హులయిన వాళ్లు ఎంత మందుంటారు గనుక?'' అని ప్రశ్నించు కొని తనను తాను ఓదార్చు కొంటోంది.

ఆమె వింటోంది. కాని ఆమె ముఖంలో నిముష, నిముషానికీ మార్పు వస్తోంది. కొద్ది సేపటి క్రితం సంతోషంగా వున్న ఆమె ముఖం ఇప్పుడు ఆందోళనా భరితంగా వుంది. ఈ రోజప్పుడే గురువారం. రేపు పండక్కి ఖర్చుచేయటానికి చేతిలో యాగానీ లేదు. ఇంట్లో ఒక్క నీటి చుక్కన్నా లేదనే సంగతి ఆమెకు గుర్తొచ్చింది. సంచిని కుట్టుతున్న సూది కదలటం మానేసింది. ఆమె ముఖంపై నీడలు కమ్ముకొన్నాయి. ఆమె పసిపిల్ల ముఖం కేసి చూసింది. అది అటు ఇటూ యిబ్బందిగా కదులు తోంది. త్వరలోనే లేవొచ్చు. ఇంట్లో దానికి పట్టటానికి ఒక్క పాల చుక్కయినా లేదు, ఏడవటానికి ఓపిక కూడా లేనంత బలహీనంగా వుంది. ఆమె వదనంలో విచారం పెరుగుతూనే వుంది, సూది మళ్ళీ వణుకుతూ అటూ ఇటూ కదులుతోంది.

చెవి పోగులూ, మెడలో వస్తువులూ తాకట్టులోవున్నాయనీ, ఆఖరికి లాంతరు కూడా అమ్మేశామని గుర్తుకు రాగానే ఆమెకు దుఃఖం పొంగుకొచ్చింది. ఆమె ముఖంలో కాసేపట్లో మేఘాలు ఉరమబోతున్నాయి. ఆమె గుంటలు పడిన చిన్నకళ్ల నుండి మెరుపులు మెరవబోతున్నాయి.

వాతావరణంలో వచ్చిన మార్పుని అతడేమీ గమనించలేదు. ఇంకా చదువుతునే వున్నాడు. అతడామె ముఖాన్ని చూడ లేదు. చూసివుంటే వణికి పోయి వుండే వాడు. అతడామె వణుకు తున్న పెదాలనిచూడలేదు. ఆమె బలవంతంగా తననితాను అదుపులో వుంచుకొంటోంది. ఆమె ఆగ్రహం వీక్షణాన్నో బద్దలు కావచ్చు.

ఆ క్షణం రానే వచ్చింది.

"అప్పుడు మనం దాన్ని పొందగలుగుతాము'' అని ఇంకా ఏదో చదవబోతున్నాడతను. అది చాలు. ఆమె హృదయం కూరిన మందుగుండు లాగుంది. చిన్నమాటచాలు అది బద్దలు కావటానికి. ఒక్క క్షణంలో అది పేలింది. వరదనీరు అడ్డున్న వస్తువులన్నింటినీ తోసేసి ముందుకు ప్రవహిస్తున్నట్లుగా ఆమె నోట్లోంచి మాటలు వెలువడినాయి.

"పొందగలమంటావా? ఓ ప్రపంచ మేలే మహారాజా! నువ్వన్నీ పొందుతావు''. ఆమె భర్తవంక చూస్తూ పాములాగా బుసకొట్టింది. "ఒకపక్కన పండగొస్తోంది. పిల్ల జబ్బుగా వుంది. ఇంట్లో పాలచుక్క లేదు''

ఆమె గుండెల్లో మంట. ఆమె కళ్లల్లో నిప్పులు!! అతడు రాయిలాగా నిశ్చేష్టుడై కూర్చొని వున్నాడు. అతని ముఖం పాలిపోయింది. అతని శ్వాస ఆగిపోయింది. అతను లేచి తలుపు వైపు వెళ్ళాడు. తలుపు దగ్గర ఆగి వెనక్కి తిరిగి ఆమె వంక చూశాడు. కోపం వల్ల ఆమె శరీరం ఇంకా వణుకుతూనే వుంది. అతను తన జేబు రుమాలుతో నొసలు తుడుచుకొని కొంచెం వెనక్కి జరిగి అన్నాడు.

"ఇదిగో విను. ఎప్పుడూ బతుకు గురించే వెంపరలాడుతున్నావు. భగవద్గ్రంథం చదువుతున్నప్పుడు కూడా నాకు శాంతి లేకుండా చేస్తున్నావు. దైవ భక్తి లేదు. పాపభీతి లేదు. ఎప్పుడూ ఇహ లోకం గురించే తాపత్రయం. పాపిష్టి దానా, నువ్విట్లాగే బతికితే నరకానికి పోవటం ఖాయం".

ఆమె నుంచి సమాధానం ఏమీ రాక పోవటంతో అతనికి మరింత ధైర్యం వచ్చింది. ఆమె ముఖం మరింత పాలి పోయింది. ఆమె శరీరం మరింత వణికి పోతోంది.

అతను మరింత దృఢంగా మాట్లాడ సాగాడు. "నరకం .... మంటలు .... నీ నాలుక్కి తాడుగట్టి వేలాడ దీస్తారు. అక్కడ నీకు నాలుగు సార్లు మరణశిక్ష తప్పదు."

ఆమె నిశ్శబ్దంగా వుంది. ఆమె ముఖం సుద్దముక్కలా తెల్లబడింది.

అతనికి తను తప్పు చేస్తున్నానని అలుసు. అంత క్రూరంగా ప్రవర్తించటం అన్యాయమని తెలుసు. ఆమె బల హీనతని వాడు కొంటున్నానని తెలుసు. అయినా ఇంకా బిగ్గరగా అరుస్తూనే వున్నాడు.

"స్కిలో అంటే తెలుసా? గోతిలో పడతోసి రాళ్లతో కొట్టి చంపటం. శ్రెఫో అంటే తెలుసా? సీసం కరిగించి పోయటం. హెరెగ్ అంటే తెలుసా? ఇదుగో ఇట్లా నీ తల కత్తితో నరుకుతారు. (తన మెడ మీద అరచేయి పోనిస్తూ నటించి చూపాడు).

అప్పటికే తను చేస్తున్న పాపం అతన్ని బాధ పెట్టడం మొదలయింది. పిచ్చిది, దీన్ని భయ పెట్టటం ఎంత తేలిక అని ఆశ్చర్యపోతున్నాడు. ఏమో, ఈలోగా తెలివి తెచ్చుకొని చీపురుకట్ట తీసుకొం టుందేమో అనే అనుమానం కలిగింది. అతను ఒక్కఉదుటన వెనక్కివచ్చి వస్త్ర కాలు సర్దుకొని అంతే వేగంగా బయటకి పోయాడు. పోతూపోతూ బలంగా లాగిన తలుపు చప్పుడికి బుజ్జిపిల్ల నిద్ర లేచింది. బరువైన కనురెప్పలు తెరచుకొన్నాయి. మైనపుముద్దలాంటి దాని ముఖం ముడు చుకుపోయివుంది. అదిపీలగా ఏడుస్తోంది. కాని ఆమె దానిఏడుపు గమనించే స్థితిలో లేదు. నిలబడిన చోటే కదల కుండా మెదలకుండా ఉండిపోయింది. కాసేపటికి తేరుకొని తనలో తాను గొణుక్కొంది.

"ఈ ప్రపంచంలో ఎట్లాగూ సుఖం లేదు. ఆప్రపంచంలోనూ నా బ్రతు కింతేనా? ఉరితీస్తారట, రాళ్లుపెట్టి కొడ తారూ? మంటల్లో తోస్తారూ? సీసం కరిగించి లోపల పోస్తారా? తల నరుకు తారా? ఆహా! ఉరి, ఉరి ... ఇక్కడే, ఇక్కడే; ఇప్పుడే .. నేనెందుకు బతకాలి? ఇంకా దేనికోసం వేచిచూడాలి?"

చంటి పిల్ల ఏడుపు పెద్దదయింది అయినా ఆమెకు వినిపించ లేదు.

"తాడు, తాడు కావాలి" ఆమె అరుస్తూ గదిలో అన్ని మూలలకీ తాడు కోసం పరిగెడుతోంది.

"ఇప్పుడే చస్తాను, నరకంలో వేసే శిక్షల్లో కనీసం ఒక్కటయినా తగ్గు తుంది. తల్లి అంటే ఏమిటో అతని తెలిసిరావాలి. బతికిన ఈ బతుకిక చాలు. తాడు ... తాడు ..."

హఠాత్తుగా ఆమెకు ఒక తాడు పొయ్యి దగ్గర ఉంచాననే విషయం గుర్తొచ్చింది.

తాడు దొరికింది. ఆమె పైకప్పు కేసి

చూసింది. ఇంతకు ముందు లాంతరు వేలాడ దీయటానికి ఉపయోగించిన కొక్కెం కన్పించింది. టేబుల్ పైకి ఎక్కితే చాలు, పని జరుగుతుంది.

టేబుల్ ఎక్కింది.

కాని ఆమె టేబుల్ పైనుండి తన బిడ్డను చూసింది. అది భయంతో ఏడుపాపి, ఉయ్యేల్లో లేచి కూర్చుంది. అది ఉయ్యేల నుండి బయటికి దూకటానికి ప్రయత్ని స్తోంది.

'అమ్మా అమ్మా', అది మళ్ళీ పీలగా వెక్కిళ్లు పెడుతోంది.

ఆమెను ఆగ్రహం, అవేదన ముంచె త్తాయి. తాడును పక్కకు తప్పించి, ఒక్క సారి టేబుల్ పైనుండి కిందకు దూకి ఒక్క ఊపుతో చంటిపిల్ల దగ్గరకు వెళ్ళింది. వుయ్యేల్లో వున్న దిండు సర్ది దాన్ని మళ్ళీ విసురుగా వెనక్కు పడు కోపెట్టి, దానితల దిండు కేసి నొక్కుతూ తనలో తాను గొణుక్కొంటోంది.

"కనీసం ఉరిపోసు కొని చావటానికి కూడా శాంతి లేదు. దీనికి పాలు కావాలి. నా ఒంట్లోంచి విషంతప్ప ఇదింకేం తాగ గలదు?

"ఆశబోతుముండా. ఇదుగో చావు!" అని ఆమె తన ఎండిన గుండెల్ని దాని నోటిలోకి కుక్కి అరిచింది.

"పీల్చు .. కొరుకు .. చంపు!"

# ఖలీల్ జిబ్రాన్ సూక్తులు

(జిబ్రాన్ ప్రపంచ ప్రసిద్ధుడైన లెబనాన్ దేశపు తాత్త్వక కవి)

నీగుండె అగ్ని పర్వతమే అయితే
నీ చేతుల్లో పూవులెలా పూస్తాయయ్యా?

మంచినీ చెడునూ విడమర్చి
చూప గలవాడు,
దైవసాన్నిధ్యం పొందగల వాడు.

తన ప్రేమగీతం పాడేటప్పుడు
భరతపక్షి తన గుండెకు
ముల్లు గుచ్చుకుంటుందట;
మనమూ అంతే. కాకపోతే
మనం పాడేదెట్లా?

విశ్వాసం గుండెలో వున్న ఎడారి
దాటలేదు దానిని ఆలోచనల బిడారు

నీకంటె ఎక్కువగా
నేను కోరే దొకటుంది;
అది నాకివ్వడం కాదు దాతృత్వం
నా కంటె ఎక్కువగా
నీకు కావలసిందాన్ని
నాకివ్వడమే దాతృత్వం.

ఉత్త చేయి చాచి ఏదీ పొందకపోవడం
బహు బాధగా వుంటుంది.
కాని నిండు చేయి చాచి పెడితే,
ఎవరూ పుచ్చుకోక పోవడం దుర్భరం.

మనిషిలో నిజానికిద్దరు
మనుషులున్నారు;
చీకటిలో మేలుకొని ఉండేవాడొకడు
వెలుగున్నప్పుడు
నిద్రపోయే వాడింకొకడు.

# పెద్ద మనుషులున్నారు! జాగ్రత్త!!

(కథ కాదు - అనుభవం)

మరా శాస్త్రి

టాటానగర్ రైల్వేస్టేషన్ ప్లాట్ ఫారం చాలా రద్దీగా వుంది. బొకారో — మద్రాసు ఎక్స్ప్రెస్ రావడానికి, ఎంతో టైం లేదు. దక్షిణాది వారంతా యీ బండి ఎక్కాల్సిందే. బొకారో, టాటా, రూర్కెలాల్లో వున్న స్టీలు ఎంప్లాయీస్ అంతా యీ స్టీల్ ఎక్స్ప్రెస్సు ఎక్కాలి. అంతా వెకేషనరీ టైములోనే ప్రయాణం పెట్టు కుంటారు; పిల్లల చదువు మూలంగ.

బండి అయితే వస్తుంది. కానీ ఎక్కడం ఎలాగ? ప్రతీ వాళ్లూ ఆలో చించేది యిదే. రైలు పట్టాల మీద కాదు పరుగెడు తూంట; గుండెల్లో పరుగెడు తూంద!

"ఏమండీ ఎలా ఎక్కుతాం? ఇంత రద్దీగా వుంది?"

"ఏం చేస్తాం? చెపితే వింటివా? ఎందుకింత లగేజి? లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్."

"అబ్బ! అసలే చికాకుగా ఉంటే, మీ సూత్రాలూ, స్లోగన్సుతో బోరుకొట్ట కండి!"

"అవునన్నయ్యా! చెపితే వినక, రెండు బెడ్డింగు లెందుకు? రెండు పెట్టె లెందుకు? ఆ స్టీలు మరచెంబెందుకు? ఆ బేస్కెట్టెందుకు!"

"అదెందుకు ఇదెందు కనటం కాదు! ఏది లేకపోతే కుదురు తుంది చెప్పండి!"

"కుదరడం ఏమిటి? కుదుర్చు కోవాలి!"

"ప్రైమ్మినిష్టర్లా మాట్లాడకండి, మళ్ళీ కాస్తంత సర్దుకోలేరు. అన్నీ సౌఖ్యాలూ తమకే కావాలి! కుదింపు ఎదర వాళ్లకి చెప్పడానికేనా?"

"అందులోనే వుంది తెలివి, సమర్థతాను! మనం త్యాగంచేసి, ఎదరి వాళ్లకి యిబ్బంది లేకుండా చూడడం లోనే వుంది, గొప్ప తనం. నా భార్య గొప్పదని చెప్పుకుందుకు నేను గర్వ పడతాను!"

"ఇంక మాట్లాడకండి! నిజం గానే పడగలరు!"

ఆ మిధునం మధ్యకు ఒక ఆగంత కుడు వచ్చి,

"మాష్టరూ! నా బేగ్ చూడండి కొంచెం, ఇప్పుడే వస్తా!" అంటూ, హడావుడిగ వెళ్ళిపోయాడు.

"ఎవరండీ ఈ అబ్బాయి? మా తమ్ముళ్ళా వున్నాడు?"

"నయం ఇంకా! మా బావలా వున్నాడన్నావు కాదు!"

"అవునండీ! అచ్చం మా సూర్యంలా వున్నాడు!"

"పోదూ! ఎవడో ఒహడులా వున్నాడు."

ఆగంతకుడు మళ్ళీ తిరిగి వచ్చాడు.

"ఎలాఎక్కాలో తెలియడం లేదు. ట్రైను వచ్చేస్తూంది! సింగిల్గాణ్ణి నేనే ఎక్కగలనా లేదా అనిపిస్తుందే.

మీరెలా ఎక్కుతారు ? ఎక్కడికెళ తారు.?

"రాజమండ్రియా? నేనూ రాజ మండ్రి వాణ్ణే! మా వూరివాళ్లు యిలా అగతగిలేరు. చాలాఆనందంగ వుంది!"

"మీరూ రాజమండ్రీ వస్తున్నారా"

"అబ్బే! నేను సి. కే. పీ లో దిగుతా. మీరో పనిచేయండి. బండి రాగానే, నేను ఎలాగోలా ఓ సీటు సంపాదిస్తా. మీరు ఆ సీటును ఆక్యుపై చేయండి. నా మిత్రుడు ఒకడున్నాడు. అతను డ్యూటీ లోనే వుంటే, మీకు టూటైర్‌లో రిజ ర్వేషన్ ఏర్పాటు చేస్తా. హాయిగా వుంటుంది! ఏమంటారు?"

"ఇంకా అనేదేముంది? అలాగే! మహాభాగ్యం!"

బండి రొజుకుంటూ, రొప్పుకుంటూ వచ్చి ఎదరకంట వెళ్ళి ఆగింది. ఎదురు గావున్న కపార్టుమెంటులోకి, లాఘ వంగ దూరి, ఓ సీటు సంపాదించాడు, ఆగంతకుడు.

"మాస్టారూ మీసామానులన్నీ ఇలా అందించండి. ఈ సీటు చూడండి. నా బేగ్ చూడండి !...

"ఆ! అన్నట్టు మీ టికెట్సు ఇలా తెండి! రిజర్వేషన్ కుదిరితే చేరిపోదాం. నేనెలాగో ఎడ్జస్టవుతా. సి కె పి (చక్ర ధరపూర్) వరకే గదా?"

భర్త రెండు టిక్కట్లు అతని చేతిలో పెడుతూ "త్వరగా రండి! కాక పోయినా మరేం ఫర్వాలేదు! ఎలాగో సర్దుకుందాం! పెట్లోపడ్డాం, ప్రయాణం ఖాయం!"

ఆగంతకుడు అంగలు వేసుకుంటూ నడిచాడు.

విజిలు అయిపోయాక తిరిగివచ్చి "సారీ మాస్టారూ మావాడు "గీతాం జిలిలో వెళ్ళిపోయాడట!" అన్నాడు.

"సారీ దేనికి? ట్రై చేశారు కదా? మీరేం చేస్తారు?" అని టిక్కట్లు తీసు కొని దాచుకున్నాడు భర్త గారు.

సికేపి వచ్చింది. ఆగంతకుడు ఆప్యా యత నందించి, అందుకొని దిగి పోయాడు. ట్రైను కదిలింది.

కంపార్టుమెంటులో టికెట్సు ఎగ్జా మినర్ ఎక్కి, టికెట్సు చూస్తున్నాడు. భార్యాభర్తలు సుఖంగా సర్దుకొని కూర్చుని కబుర్లు చెప్పు కొంటున్నారు. ఎగ్జామినర్ దగ్గరగా వచ్చి "టికెట్సు ప్లీజ్" అన్నాడు.

భర్త గారు టికెట్సు అసంకల్పి తంగా అందిచ్చి భార్యతో కబుర్లు చెబు తున్నాడు. "ఫేస్ యీజ్ ది ఇండెక్స్ ఆఫ్ ది మాన్ – అన్నారు. ముఖం చూసి చెప్పవచ్చు. దొంగ ఎవరో దొర ఎవరో !"

"సారీ! మాష్టరూ! మీరు సికేపిలో దిగాల్సింది, దాటి వచ్చేశారు! పెనాల్టీ కట్టాలి!"

తృళ్లి పడ్డాడు భర్త. కాస్సేపు వాదం జరిగాక, భర్త గ్రహించాడు తానిచ్చిన టిక్కట్లు సికెపి టికెట్లని! రాజమండ్రి టికెట్లు ఏమయ్యాయి? తిరిగి వాదం. రాజమండ్రి టికెట్ల నెంబరు వ్రాసుకున డైరీ చూపించాడు. ఎగ్జామినర్‌కు తృప్తి కలిగింది. కానీ, ఏంచేస్తాడు? తర్వాత స్టేషన్‌లో బండి ఆగాక, టాటాకి ఫోన్ చేసి అడిగి తెలుసుకున్నాడు. తెలిసిందేవి టంటే —

ఆ టికెట్లు కాన్సిల్ చేయబడి, ఎన్‌కాష్ చేయబడ్డాయని !

పెద్ద మనుషులున్నారు! జాగ్రత్త !!

# వీరేశలింగానికి ఆద్యుడైన సంఘ సంస్కర్త స్వామినేని ముద్దు నరసింహులు నాయుడు

అక్కిరాజు రమాపతిరావు

ఈ పుస్తకం అచ్చయి నూట పదహారు సంవత్సరాలు గడిచాయి. ఇది హితోపదేశం, పంచతంత్రం వంటి కథల పుస్తకమేమీ కాదు. ఒక విధంగా నీతి గ్రంథం.

గ్రంథకర్త స్వామినేని ముద్దు నరసింహులు నాయుడు.

ఈయన గారు రాజమహేంద్రవరం ఫస్టు క్లాసు డిస్ట్రిక్టు మున్సుబుగా పని చేశారు.

ఈ గ్రంథం 1862 లో అచ్చయింది. అచ్చయ్యే నాటికి గ్రంథకర్త లేరు. గ్రంథకర్తగారి కుమారుడు రంగ ప్రసాద నాయుడు గారు అచ్చు వేయించారు. అంటే 1862 కన్నాకూడా ముందే ముద్దు నరసింహులు నాయుడుగారీ గ్రంథాన్ని రచించారన్నమాట.

'వైతాళికులు' వంటి గొప్ప కవితా సంకలనం ప్రచురించిన ముద్దు కృష్ణ గారికి ముద్దు నరసింహులు నాయుడు గారు తాతగారట. ఈ గ్రంథం వచన గ్రంథం. వ్యావహారికానికి చాలా దగ్గరగా ఉంది. నాటి వ్యావహారిక భాషలోనే రచితమైందని కూడా చెప్పవచ్చు. 224 పుటల గ్రంథం. డెమ్మీ సైజు.

ఇందులో ఎనిమిది వ్యాసాలున్నాయి. ఆ రోజుల్లో వ్యాసాలను 'ప్రమేయా' లని అనేవాళ్ళు. గిడుగు రామ్మూర్తి పంతులుగారీ వ్యాసాలను మెచ్చుకున్నారు. 'విద్యాప్రమేయం, వైద్యప్రమేయం, సువర్ణప్రమేయం, మనుష్యేతరజంతుసంజ్ఞా ప్రమేయం, రక్షఃప్రభృతి ప్రమేయం, మంత్రప్రమేయం, పరోక్షాదిజ్ఞానప్రమేయం, వివాహప్రమేయం' అనే వాటిని గూర్చి ఈ గ్రంథంలో వివరిస్తున్నానని రచయిత పీఠికలో పేర్కొన్నారు.

ఇంచుమించుగా నూట ఇరవై, నూట పాతిక సంవత్సరాల క్రితమే ఇటు వంటి గ్రంథాన్ని రచించడానికి, ఇంగ్లీషు విద్యా ప్రభావం ఈ రచయితపై బాగా పనిచేసి ఉంటుంది. అన్ని ఆధునిక భావాల నాయన వ్యక్తం చేశారు. ఈ గ్రంథం ప్రభావం వీరేశలింగం గారి పైన కూడా చాలా ఉంది. సంఘ సంస్కరణ దృష్టి ప్రధానంగా ఈయన్ను ప్రేరేపించిందని చెప్పాలి. స్త్రీవిద్య పట్ల, స్త్రీలకు జరుగుతున్న అన్యాయంపట్ల ముద్దు నరసింహులు నాయుడు గారు, నిర్మాణాత్మకమైన సూచనలనెన్నిటినో తెలియజేశారు.

జనవ్యవహారంలో ఉన్న ప్రయోగాలను యథాతథంగా వాడుకోవడం యుక్తమేనని, వ్యావహారిక భాషకు ఆ రోజుల్లోనే సమర్థనం కలిగించారు వీరు. బండిరాను పాటించ లేదు. అరసున్నలు తీసివేశారు. భాషా విషయికంగా ముద్దు

నరసింహులు నాయుడుగారి వ్యాసాలు వీరేశలింగం గారిపై ప్రభావం చూపక పోయినా, మంత్ర తంత్రాలను, దయ్యాలు, భూతాలను కొట్టి పారేయడంలోనూ, స్త్రీవిద్య అవశ్యకతను నొక్కిచెప్పడంలోనూ, కాలాన్నిబట్టి, సామాజికావసరాలను బట్టి, సాంఘికాచారాలు మార్చుకోవా లనడంలోనూ, శాస్త్రీయ విజ్ఞానం సులభశైలిలో అందించాలనడంలోనూ, వీరేశలింగాన్ని ఈ గ్రంథం బాగా ప్రభావితం చేసిందని చెప్పవచ్చు. ఆ నాటి సంఘంలోని దురాచారాలు, మూఢ విశ్వాసాలు, సాంఘిక అసమానతలు, హితసూచని గ్రంథకర్త విమర్శించారు. ఆ నాడు ప్రజలలో స్వర్ణవిద్యపట్ల ఉన్న భ్రాంతిని, నమ్మకాన్ని ఖండించారు. వివాహప్రమేయం (163 – 224) అనే వ్యాసంలో స్త్రీవిద్య, స్త్రీపునర్వివాహాలను గట్టిగా సమర్థించారు. రజస్వలానంతరం వివాహాలు జరగాలని గట్టిగా చెప్పారు. అన్నిటికన్నా అసక్తికరమైన విషయం, వధూవరులు ముందుగా ఒకరినొకరు చూసుకుని, ఇష్టపడి, ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని సలహా చెప్పారు. నూట ఇరవై సంవత్సరాలకు పూర్వమే ఇటువంటి అభిప్రాయాలు వెలిబుచ్చడం, రచయిత ఆధునిక దృక్పథాన్నీ, అభ్యుదయ భావాలను వెల్లడిస్తున్నాయి. వీరేశలింగం గారు – స్వయంవరణ భావ్యమా ? అది భారతదేశంలో, అందునా అగ్రవర్ణాలలో ఏ నాటికీ సంభవిస్తుందనుకోను అని స్వీయ చరిత్రలో వ్రాశారు. వీరేశలింగంగారికి వివాహం కాకముందే స్వామినేని వారు ప్రేమ వివాహాలను సమర్థించారు. అతి బాల్య వివాహాల వల్ల సంఘంలో కలిగే కష్టనష్టాలు, నిర్బంధ వైధవ్యంలోని క్రౌర్యం, పెళ్ళిళ్ళలో అమిత వ్యయాలు, చాదస్తాలు, విపరీతపు వేడుకలు, స్వామినేనివారు విమర్శించారు. మంత్రప్రమేయంలో జ్యోతిశ్శాస్త్రాన్ని, సాముద్రికాన్ని తీవ్రంగా విమర్శించారు. ఇంకా దయ్యాలు, భూతాలు మొదలైన వాటిని గూర్చిన భ్రమలను రక్షఃపభృతి ప్రమేయంలో విమర్శించారు. విద్యా ప్రమేయంలో, శాస్త్రజ్ఞానాన్ని గూర్చి, విద్యారంగంలో ప్రవేశ పెట్టవలసిన నవీన పద్ధతులను గురించీ వివరించారు.

1862 వ సంవత్సరంలో తొలిసారిగా ముద్రణం పొందిన ఈ పుస్తకం ఇంతవరకూ మలి ముద్రణానికి నోచుకోలేదు. ఇటువంటి మంచి పుస్తకాన్ని ముందు తరాల వాళ్ళకు అందజేయడం, స్వంత లాభం కొంతైనా మానుకొనే సాహిత్య సంస్థలో, వ్యక్తులే ఆలోచించ వలసిఉంది.

## బేడీలు ............ జయంపు కృష్ణ

గోడు కవిత్వం రాశానని
మాడు అదరగొట్టి,
బేడీలు వేశారు నాకు, -
అయినా
నా పెన్ను రాస్తూంది

మిన్ను విరిగేలా
నిప్పులు కురిపిస్తూంది
కన్ను తెరిసే అది
గన్నుగా మారుతుంది

పాపం!
వాళ్ళకు తెలియదు
పెన్నుకు బేడీలు
వేయ లేమని

# రా.రా. 'సారస్వత వివేచన'

## రామారావు గారి అనిష్ట విమర్శకు జవాబు

శ్రీ రాచమల్లు రామచంద్రా రెడ్డిగారి సారస్వత వివేచనపై శ్రీ జి. జె. రామారావు గారు మే నెల అభ్యుదయలో సమీక్ష రాస్తూ రా. రా. సాహిత్య విమర్శ కంతటకీ ప్రధానంగా ఆయన (రా. రా.) "యిష్టానిష్టతలే" కొలబద్ద అని తేల్చి చెప్పాలని ప్రయత్నించినట్టుంది. కాని దురదృష్టం ఏమంటే యీ సరి కొత్త సూత్రీకరణ చెయ్యాలన్న ప్రయత్నంతో రామారావుగారు సుదీర్ఘంగా రా. రా. వ్యాసాల నుండి చేసిన ఉటంకింపులలో ఏ ఒక్కటీ ఆయన లాజిక్కును బలపర్చడం లేదు, పైగా రామారావుగారి తర్కాన్ని మాత్రం వెల్లడిస్తున్నాయి.

ఎందుకంటే శ్రీ జి. జె. రామారావు గారికి తెలుగు భాష తెలియదని అనుకోలేం. సాహిత్య పరంగా తూచి వాడిన శబ్దాలకు అర్థాలు తెలియవనీ అనుకోలేం. పైగా "ఎంత కష్టమైన విషయాన్నైనా సులభంగా అర్థమయ్యే భాషలో రాయగల రా. రా. శక్తి" అంటూ రా. రా. శైలిని గురించి చెప్పిన రామారావు గారికి యీ వ్యాసాలు అర్థం కావడంలో ఏ చిక్కూ లేదని కూడా తెలుస్తూనే వుంది. అయినా రామారావుగారు రా. రా. చెప్పిన "కళానియమాల ధ్యాసనీ" "కళాత్మకతనీ" ఒకటిగానే చెప్పడం, "హృదయానికీ" "మేధకు" రా. రా. వైరుధ్యం కల్పించాడనడం, "హృదయమే" రా. రా. సాహిత్య విమర్శకు కొలబద్ద అయినట్టుగా చెప్పడానికి పూనుకోవడం సంభవించాయంటే రా. రా. ను రామారావుగారు కావాలనే వక్రీకరణ చేశారని, తెలుసుండే పాఠకుల్ని తప్పు మార్గంలో పెట్టించడానికి పూనుకున్నారని చెప్పక తప్పడం లేదు.

రా. రా. "సాహిత్యం" మీద చెప్పిన అంశాల నుండి అనేక ఉటంకింపులు గుదిగుచ్చి పెట్టారు రామారావుగారు. వీటన్నింటిలోనూ రా. రా. చెప్పింది సాహిత్యం గురించే. కళ అంటే అనుభూతి అనీ, సాహిత్యానికి హృదయమే కేంద్రం అనీ, సాహిత్యం సంపూర్ణంగా హృదయ వ్యాపారం అని మాత్రమే రా. రా. చెప్పారు. అంతేకాని రామారావుగారు చెప్తున్నట్టు "సాహిత్య విమర్శకు" సంపూర్ణంగా హృదయం కేంద్రం అని గాని "సాహిత్య విమర్శ" సంపూర్ణంగా హృదయ వ్యాపారం అని గానీ ఎక్కడా ఆయన ప్రస్తావించలేదు. రా. రా. చెప్పని విషయాల మీద రామారావు గారు కేసు బిల్డ్ చేశారు.

కృత్రిమంగా హృదయం, మేధలకు వైరుధ్యాన్ని కల్పించాడంటూ రా. రా.వి నిమర్శిం చిన రామారావుగారే "...సాధారణజ్ఞానం ప్రకారమై తేనేమి,

**డి. వి. వి. యస్. వర్మ**

శాస్త్ర జ్ఞానము ప్రకారమైతేనేమి, అనుభూతులు అనగా రా. రా. గారి "హృదయము", ఆలోచనలూ, భావాలూ అనగా రా. రా. గారి మేధస్సు - ఈ రెండు వర్గాలు మనిషి చైతన్య అవగాహనలలో రెండు భాగాలు" అని అంటారు. "ఆలోచన అనుభూతితో సన్నిహితంగా మిళితం అయివుంటుంది" అని కూడా అంటారు. రామారావుగారి మాటల్లో చూసినా ఆలోచనలూ అనుభూతి రెండూ "ఎంత సన్నిహితంగా మిళితం అయివున్నా" రెండూ రెండే. ఎన్నటికీ ఆలోచనా అనుభూతి ఒక్కటే మాత్రం కావు. కాలేవు, అతి సున్నితమైనదే అయినా యీ రెంటికీ తేడా చూపడానికే హృదయం, మేధస్సు అనే రెండు భావనలు అవసరం అవుతాయి. అందులో హృదయం అనుభూతి కేంద్రం కాగా మేధస్సు ఆలోచనా కేంద్రం అయినాయి సాహిత్యంలో.

ఇక సాహిత్యం హృదయ వ్యాపారమూ కాదా అన్నదాన్ని పరిశీలిద్దాం. సాహిత్యం మీద రామారావు గారి అభిప్రాయాన్నే చూద్దాం. "అనగా సాహిత్యంలోని భావాలు, ఆలోచనలు సన్నివేశాలు మనలో అనుభూతి రూపంలో వస్తవి" అంటారు రామారావుగారు. అనుభూతి, ఆలోచనా రెండూ ఒక్కటే కానప్పుడు, అనుభూతికి హృదయం సంకేత కేంద్రం అయినప్పుడు, సాహిత్యం అనుభూతి రూపంలో వస్తున్నప్పుడు రా. రా. చెప్పిన "సాహిత్యం సంపూర్ణంగా హృదయ వ్యాపారం" అన్నదాన్ని రామారావుగారు కాదని ఎలా అనగలరు? అలాంటప్పుడు రా. రా. "హృదయం, మేధలను" కృత్రిమంగా సృష్టించాడన్న రామారావుగారి వాదనే ఉత్పన్నం కాదు. సాహిత్యంలో యీ రెంటికీ వున్న తేడా చూపడానికి రా. రా వూనుకుంటే దాన్ని "వైరుధ్యంగా" రామారావుగారు చిత్రించడము హాస్యాస్పదమే అవుతుంది.

ఇక సాహిత్య విమర్శ రా. రా. చేపట్టిన కొలబద్ద హృదయ ప్రధానంగా యిష్టానిష్టాల ప్రాతిపదిక పైనే సాగిందా అన్న పరిశీలనకు వూనుకుందాం. సాహిత్య విమర్శ గురించిన ఒక ప్రస్తావనలో రా. రా. "(సాహిత్య) విమర్శ మేధా వ్యాపారమే గదా అనవచ్చు. కాని సాహిత్యాన్ని ముందు హృదయంతో ఆస్వాదించి తర్వాత మేధతో పరిశీలించినవాడే ఉత్తమ విమర్శకుడౌతాడు" అంటాడు. చేసేది సాహిత్య విమర్శ గనుక, సాహిత్యం అనుభూతి ప్రధానం కనుక ముందు హృదయంతో ఆస్వాదించి తరువాత మేధతో పరిశీలించడం ఉత్తమ విమర్శలకు లక్షణంగా వుండాలన్నదే రా. రా. అభిప్రాయం. అదే ఏ అర్థ శాస్త్ర విమర్శో, తర్క శాస్త్ర విమర్శో అయితే హృదయంతో ఆస్వాదించే సమస్యే ఉత్పన్నం కాదు. ఎందుకంటే అవి హృదయ వ్యాపారాలు కావు గనుక.

అయితే సాహిత్యాన్ని హృదయంతో ఆస్వాదించిన తర్వాత విమర్శకుడు మార్క్సిస్టు మేధావి అయితే ఆ కొలబద్దలతో ఆ సాహిత్యాన్ని అంచనా కడతాడు. అదే బూర్జువా మేధావి అయితే వేరే కొలబద్దలతో దానిని అంచనా కడతాడు. అంటే హృదయం పాత్ర సాహిత్య దర్శనానికి సాధనం మాత్రమే. సాహిత్య విమర్శకుని మేధస్సు, వారి వారి తాత్విక పునాదీ కొలబద్దలవుతాయి. అందుకే

రా. రా కొలబద్ద స్పష్టంగా మార్క్సిస్టు కొలబద్ద. అంతేగాని రామారావుగారు భ్రమపడినట్టు "ఇష్టానిష్టాల" కొలబద్ద కానే కాదు.

రా. రా. కొలబద్దను అర్థం చేసుకోడానికి తిలక్ కవితా సంపుటిపై ఆయన చేసిన సమీక్షను ఉదాహరణగా తీసుకుందాం. తిలక్ గురించి రాస్తూ "శ్రీ శ్రీ తర్వాత ఇంత భావుకత్వంగల కవి బహుశా మనకు లేడేమో. యీ భావుకత్వానికి తోడు తన హృదయంలోని అనుభూతిని వ్యక్తం చేయగల శబ్దశక్తి అలంకారపుష్టి కలసి రావడంతో తిలక్ ఉత్తమశ్రేణి కవి కాగలిగినాడు" అంటారు రా. రా. శ్రీ రామారావుగారి "ఇష్టానిష్టాల" కొలబద్దను రా. రా. కు వర్తింపజేసి చూద్దాం. శ్రీ శ్రీ మీద రా. రా. కు యిష్టం వుండబట్టే శ్రీ శ్రీని పొగడి నాడనుకుందాం. శ్రీ శ్రీని ఆకాశం అంత ఎత్తున పెట్టి అభ్యుదయ మహాకవిని చేసివేసినాడను కుందాం. అలాంటి రా. రా.యే శ్రీ శ్రీ తర్వాత అంత భావుకుడు లేడేమోననీ, 'ఉత్తమశ్రేణి కవి' అనీ తిలక్‌ను పొగిడిన వాడే ఎందుచేత ఏ మొహమాటమూ లేకుండా నిర్ద్వంద్వంగా తిలక్‌ను భావకవి అని చెప్పాడు? "ఇష్టానిష్టాలే" రా. రా. సాహిత్య విమర్శకు గీటురాళ్ళయితే "శ్రీ శ్రీ తర్వాత అంతటి అభ్యుదయ కవి తిలక్ ఒక్కడే" అని చెప్పి వుండేవాడు.

కాని రా. రా. తిలక్ కవిత్వాన్ని తన హృదయంతో ఆస్వాదించాడు. తిలక్‌లోవున్న భావుకత్వాన్ని దర్శించ గలిగాడు. ఉత్తమశ్రేణి కవిగా తిలక్‌ను గుర్తించాడు. అయితే రా. రా. మార్క్సిస్టు సాహిత్య విమర్శనా పద్ధతి తను ఉత్తమశ్రేణీ కవిగా చూసిన తిలక్‌ను భావకవి అని తేల్చి చెప్పింది. అందుకే యిందులో రా. రా. "యిష్టానిష్టాల" ప్రసక్తి ఉత్పన్నం కాలేదు.

ఇక రామారావుగారు రా. రా.లోని "యిష్టానిష్టతల్ని" చూపించడానికి మరొక ఉదాహరణ చెప్పారు. రా. రా. కు చలం "యిష్టుడు" గనుక "కళా నియమాల ధ్యాసే లేక పోయినా చలం రచనలు ఆయనకు సాహిత్యంగా వుందనీ మరొకచోట వీరేశలింగం రచనలు "కళాత్మకంగా చౌకబారువని" తీర్పు చెప్పడం రా. రా. గారి "అనిష్టతే" కారణమని రామారావుగారు వాదిస్తున్నారు.

"కళానియమాలు" వేరు "కళాత్మకత" వేరు. అన్న అంశాన్ని రామారావు గారికి చెప్పక్కర లేదనుకుంటాను. సాహిత్యంలో కళానియమాలు శరీరం అంగాలు వాటి పొందికా అయితే, కళాత్మకత జీవం. సాహిత్యంలో "కళా నియమాల ధ్యాస" లేకపోవడాన్ని క్షమించవచ్చుగాని "కళాత్మకతే" లోపిస్తే సాహిత్యం కాలేదు. జీవచ్ఛవమే అవుతుంది. కళాత్మకత లేకుండా ఎన్ని విప్లవ కర భావాలు గుప్పించినా అది ఏ ప్రచారోపన్యాసమైనా అవుతుందేమో కాని సాహిత్యం కాలేదు.

చలంకు "కళానియమాల ధ్యాస" లోపిస్తే వీరేశలింగంగారికి "కళాత్మకత" లోపించింది. అందుకే వీరేశలింగం గారివి కళాత్మకంగా చౌకబారు రచనలయ్యాయి.

చలం భావాలను "విప్లవాత్మక" భావాలన్నందుకు రా. రా.ను ప్రశ్నించాల్సివుందంటున్నారు రామారావుగారు. "కారణం ఏమంటే ఉత్పత్తి సంబంధాలను వాటిననుసరించి మొత్తం సాంఘిక సంబంధాలను మార్చే లక్ష్యంగల భావాలను మాత్రమే విప్లవాత్మక భావాలని గణించడం సమంజసం" అంటూ చలం భావాలు ఒక అంశానికి మాత్రమే వర్తించేవి గనుక వాటిని తిరుగుబాటు భావాలనడం సబబు అనీ, "ఇదే లోక వాడుక" అనీ రామారావు గారంటున్నారు. ఈ సిద్ధాంతవాదాన్ని ఎవరూ కాదనరు. కాని "ఇదే లోక వాడుక" అనీ రా. రా.కు కనీసం యీ మాత్రం కూడా తెలియదు సుమా అనడంలోనే వుంది పొరపాటంతా. ఎందుకంటే "సాంకేతిక విప్లవం", "భావ విప్లవం" వగైరాలనేకం నిత్యం కొమ్ములు తిరిగిన అంతర్జాతీయ మార్క్సిస్టు సిద్ధాంత వేత్తలు ఒక రంగానికి పరిమితమైన వాటికి వాడుతూవుండడం రామారావుగారికి తెలియనిది కాదు.

అలాగే రామారావుగారికి "తిరుగుబాటు భావాలు", "తిరుగుబాటుతత్వం" ఒకటిగానే కనిపించింది. అందుకే తన తప్పును రామారావుగారు రా. రా. మీద పెట్టి "రా. రా. గారి సాంఘిక దృష్టిలో ఆత్మాశ్రయత లోతుగా నాటుకుని వుందన్న మాట" అంటూ తర్కానికి దిగారు. వ్యాస విస్తృతి దృష్ట్యా చివరి అంశంలోకి వెడదాం.

ఇక దిగంబరుల మూడో సంపుటిపై రా. రా. చేసిన విమర్శ ఆయన అనిష్టతకు పరాకాష్ట అంటున్నారు జి. జె. గారు. "దిగంబరులది ఎలా కవిత్వం కాదో ప్రత్యక్షంగా నిరూపించ లేదు" అనే రామారావు గారికి సోదాహరణలతో నిరూపించినా తృప్తి పడతారనుకోను. ఎందుకంటే ఆయన "ఇష్టానిష్టతల" సూత్రీకరణలో మరొక పాయింటు పోతుంది.

దిగంబరులలో రామారావుగారన్నట్టు కొన్ని కవితా చిత్రాలుండొచ్చు. కాని వాళ్ల "కడగని ఎండిన పీతిముడ్డి" కంపులో అవి కొట్టుకు పోయాయి. "రెండోసారి పిచ్చెక్కి చేసుకున్న వాంతులలో" కప్పుపడి పోయాయి. "శిశ్న శిఖరాగ్రం మీద భూగోళాన్ని నిలబెట్టే" "బూతు సర్కస్ ఫీట్లలో" నలిగిపోయాయి. అంతా కలిసి జుగుప్స కలిగించాయి. రామారావుగారు చెప్పినట్టు అందులో చెయ్యెట్టి కొన్ని కవితా చిత్రాలను వెలికి తియ్యడం సాధ్యమో కాదో నాకు తెలియదు గాని రా. రా. కు బహుశః సంస్కారం అడ్డొచ్చి వుంటుంది. అందుకే ఆ సంపుటి మొత్తం మీద తీర్పు చెప్పివుంటాడు. ఈ మూడో సంపుటిలో దిగంబరులు సాహిత్యంలో "లంపెన్ ప్రోలిటేరియట్లుగా" అన్ని రంగాలలోనూ స్పష్టంగా బైటపడ్డారు. దీన్ని పసికట్టింది రా. రా.యే. సాహిత్య లంపెన్ ప్రోలిటేరియట్లతో ఎలా వ్యవహరించాలో అంత కఠినంగానే రా. రా. వ్యవహరించాడు.

మొత్తంమీద రామారావుగారి సమీక్ష ముందుగా గిరిగీసుకుని రా. రా. కు "ఇష్టానిష్టాల్ని" అంట గట్టాలనే తాపత్రయంలో సాగింది. రా. రా. పై నిస్సందేహంగా రామారావుగారు వాడింది తన "అనిష్టతా" కొలబద్దనే.

# అమెరికన్ నీగ్రోల గాథ

# కుదురు

(నా కుదురును అన్వేషించడానికి పన్నెండేళ్లు పడుతుందనుకోలేదు-అంటాడు "రూట్స్" అన్న గ్రంథ రచయిత హాలే. అమెరికా ద్విశతాబ్ది సందర్భంగా ఇది ప్రచురించబడుతుండడం కూడా కాకతాళీయమే. అందుచేత నా కుదురులో అధిక భాగం విస్తరించిన అమెరికాకిది పుట్టిన రోజు కానుకగా ఇస్తున్నానంటాడు. నిజంగా మంచి కానుక.)

రెండు వందల ఏళ్ల క్రితం ఆఫ్రికా నుంచి అమెరికాకు పట్టి తెచ్చిన ఒక నీగ్రో బానిస తన కూతురు కిజ్జీకి ఆఫ్రికాలో తన జీవితం గురించీ, తాను పట్టుబడిన విధం గురించీ చెప్తుండేవాడు. తమ భాషలో పదాలు ఆమెకు నేర్పుతుండేవాడు. అదే ఈ నవలకు ప్రేరణ కావడం చిత్రంగా కనిపిస్తుంది.

అతడు కాంబీ బొలాంగో వొడ్డు వూళ్లో వుండేవాడు. ఒక రోజున వూరి పక్క అడవిలోకి కర్ర కొట్టి తేవడానికి వెళ్లినప్పుడు నలుగురు మనుష్యులు అతణ్ణి పట్టుకొని ఒక ఓడలోవేసి అన్నాపొలిస్ తెచ్చారు. అక్కడ జాన్ వాల్లర్ అనే ఆయన అతనిని బానిసగా కొనుక్కొని 'తోబీ' అని పేరు పెట్టేడు.

అయితే ఆ నీగ్రో, బానిసగా బతక దలచలేదు. తన యజమాని కట్టడి నుంచి నాలుగుమార్లు పారిపోయేడు. అన్నిమార్లు దొరికిపోయి, నానా హింసలకు గురి అయ్యేడు. నాలుగోమారు పట్టుబడినప్పుడు మరి పారిపోకుండా ఒక పాదాన్ని వేళ్లదగ్గరకు నరికేసేరు.

జాన్ వాల్లర్ తమ్ముడు విలియం వాల్లరు చాల దయగలవాడు. డాక్టరు గాయాలతో అతి ప్రమాద దశలోవున్న ఆ నీగ్రో బానిసను కాపాడి, అన్నగారి నుంచి అతనిని కొనేసి తన వద్ద పెట్టుకున్నాడు. అక్కడే ఆ నీగ్రో బానిస బెల్ అనే మరో బానిసను పెళ్ళాడాడు. వారి సంతానమే కిజ్జీ.

ఆ నీగ్రో బానిస తన పేరు 'తోబీ' అంటే కూడా వొప్పుకోలేదు. తన కూతురు కిజ్జీకి తన పేరు తోబీ కాదని, క్రైరాబా కుంటా కింటేయని నూరిపోసేడు. తామున్న చోట పారే నదిని చూపి 'కాంబీ బొలాంగో' అన్నాడు. "యిరో" అంటే చెట్టు, "నిప్పెముసో" అంటే ఆవు. వర్షాన్ని "సాంజియో", సూర్యుణ్ణి "టిలో" అన్నాడు. తలకి "కుంగో", జుట్టుకి "కుంటిన్యో", ముక్కుకి "నుంగో", చెవికి "టులో", నోరుకి "డా", ఫిడేలు వంటి వాద్యాన్ని చూపి "కో" అని బోధించేడు. ఇవన్నీ అతని భాషలోని పదాలు.

ఈ కథను కిజ్జీ తన కొడుక్కి, అతడు తన సంతానానికి, వారుత మ

సంతానాలకి చెప్పడం ఒక సంప్రదాయం చేశారు. ఆఫ్రికనులకి అది కొత్త కాదు. వారి గ్రామాలలో కుటుంబ చరిత్రను పిల్లలకు నేర్పడం వారి సంస్కృతిలో ఒక భాగం. అలాగే గ్రామాల చరిత్రను, ప్రధాన కుటుంబాల చరిత్రను సవివరంగా నేర్చుకొని, స్వరబద్ధంగా పాడి వినిపించడం ఒక వృత్తిగా చేసుకొన్న గ్రొయట్‌లు వారిలో వున్నారు. ఆ సంప్రదాయాన్ని కింటే ప్రవేశ పెట్టడం ఈ నవల (రూట్స్) పుట్టుకకి కారణం అయింది.

డాక్టర్ వాల్లర్ కిజ్జీని, పదహారేళ్ల వయస్సులో టామ్ లియా అనే కోడి పందేలవానికి అమ్మేశాడు. అతడామెను బలవంతంగా అనుభవించి, ఉంపుడు కత్తెను చేసుకున్నాడు. వారికి జార్జి పుట్టేడు. తండ్రి పందెపు కోళ్ళ పిచ్చి కొడుకుకీ పట్టుకుంది. ఆ పిచ్చితో వాని పేరే కోడి పిల్లల జార్జి అయింది.

ఈ జార్జికి మటిల్డా భార్య. వారికి ఎనిమిది మంది సంతానం. వారిలో నాలుగోవాడు టామ్. అతడు కమ్మరంలో నైపుణ్యం సంపాదించేడు.

కొన్ని ఏళ్ల తరువాత టామ్ లియా తన కొడుకు జార్జిని ఒక బ్రిటిష్ కోళ్ల పందెగానికి అద్దెకిచ్చేడు. జార్జి భార్యనూ పిల్లలనూ ముర్రే అనేవానికి అమ్మేసేడు.

ఈ సంతానంలో కమ్మరం నిపుణుడు టామ్ కూడా వున్నాడు. అతడు ఇరినా అనే ఆమెను పెళ్ళాడేడు. ఇరినా ఒక రెడ్ ఇండియను స్త్రీకి, ఒకతెల్లవానికి పుట్టినది. అటువంటి వారిని "ఇంజున్" లంటారు.

ఈ దంపతులకి మళ్లీ ఎనిమిది మంది సంతానం. వారిలో సింథియా ఆఖరుది. ఆమెకు రెండు మూడేళ్ల వయస్సప్పుడు అబ్రహాం లింకన్ అమెరికా అధ్యక్షుడు కావడం, ఉత్తర దక్షిణ రాష్ట్రాల మధ్య అంతర్యుద్ధం, బానిసల విముక్తి, అమెరికా సంయుక్త రాష్ట్రాల నిర్మాణం జరిగింది. అమెరికాలో నల్ల జాతులు బానిసత్వం నుంచి బయటపడ్డారు.

సింథియా పామర్ అనే వానిని పెళ్లి చేసుకొంది. వారి కూతురు బెర్తా. ఆ బెర్తా కొడుకే రూట్స్ గ్రంథకర్త అలెగ్స్ హాలే.

ఎన్ని కష్టాలు పడుతున్నా, ఎంతెంత దూరం చెదిరిపోయినా, తరాలు గడిచినా ఈ కుటుంబాలు కింటే చెప్పిన చరిత్రను తమ సంతానానికి చెప్పడం సాగిస్తూనే వచ్చేరు. ఆ కథను అలెగ్స్ హాలే తన చిన్నతనంలో ఎన్నోమార్లు విన్నాడు. అప్పుడు దాని ప్రాముఖ్యం కనబడక పోయినా, పెద్దయై కథా రచయితగా, పాత్రికేయుడుగా జీవిక గడుపుతున్న దశలో కనిపించింది. తన పూర్వుల విషయాలు సేకరించాలనిపించింది. అందుకు అతని దగ్గరున్నదల్లా ఆ నోట ఆ నోట వచ్చిన వంశవృక్షమూ, కింటే చెప్పిన కథా, అతడు కూతురుకు నేర్పిన మాటల్లో మిగిలిన ఒకటి రెండూను. అవైనా వికృత రూపంలో. ఆ ఒకటి రెండు మాటలే ఆయనకు దారిచూపేయి. ఆఫ్రికను భాషా పండితులు బొలాంగో అంటే కదిలే నీరు – నది అన్నారు. కాంబీ బొలాంగో అంటే గాంబియా నది అన్నారు. ఇంక మిగిలిన పదాల్నిపట్టి అవి "మండింకా" అనే తెగవారి పలుకు బళ్లు అని తేల్చేరు.

హాలే గాంబియా వెళ్లేడు. మండింకా తెగవున్న ప్రాంతాలకు చేరుకున్నాడు. అక్కడొక గ్రొయట్ పాట ఆయనకు కావలసిన సమాచారాన్నిచ్చింది. జుఫురే అనే ఆ వూళ్లో కింటే కుటుంబం చాల ప్రసిద్ధం. ఆ కుటుంబంలో పుట్టిన కుంటా కింటే బ్రిటిష్ రాజు సైన్యాలు వచ్చిన సంవత్సరం, కట్టెలు నరకడానికి అడివికి వెళ్లి మరి తిరిగి రాలేదు. - అన్నాడు గ్రొయట్, ఆరేడు తరాల పూర్వపు కథను చెప్తూ. సరిగ్గా కింటే చెప్పిందే.

అదే సంవత్సరమో తెలుసుకొనేందుకు హాలే ఇంగ్లండు వెళ్లేడు. గాంబియా నదిమీద బానిస వ్యాపారులు కట్టుకొన్న కోటను రక్షించేందుకు 1767 లో బ్రిటిష్ రాజు సైన్యాన్ని పంపేడు 1767 జూలై 5న లార్డ్ లిగోనీర్ అనే నౌక గాంబియా నుంచి బానిసల్ని తీసుకొని సెప్టెంబరు 29న అన్నాపొలిస్‌కు చేరిందని లాయడ్స్ కంపెనీ రికార్డులు తెలిపాయి.

ఈమారు హాలే మళ్లీ అమెరికాలో అన్వేషణ సాగించేడు. అన్నాపోలిస్ నుంచి ప్రచురించబడుతుండిన మేరీలాండ్ గజెట్ అక్టోబరు మొదటి వారంలో బానిసల వేలం ప్రకటన వేసింది ఆ పత్రిక దొరికింది. తర్వాత స్పాట్సిల్వానియా లీగల్ రికార్డులలో 1768 సెప్టెంబరు 5న జాన్ వాల్లర్‌కు "తోబీ" అనే బానిసను అమ్మినట్లు పత్రం దొరికింది. ఈ విధంగా కింటే చెప్పిన కథ పత్రాధారాలతో రుజువయింది.

రెండు ఖండాలలో 200 వందల సంవత్సరాల కాలంలో జరిగిన 7 తరాల తన పూర్వీకుల గాధను పన్నెండు సంవత్సరాల పరిశోధనతో సేకరించి అలెక్స్ హాలే దానిని "రూట్స్" (కుదురు) పేరున నవలగా వ్రాసేడు. "ఈ నవలలో నిజమెంత? కల్పన ఎంత?" - అని తానే ప్రశ్నించుకొని, వంశ వృక్షాన్ని, క్రమాన్నీ మా వాళ్ల నుంచి ముఖతః విని సేకరించేను. మూడు ఖండాలలో అనేక గ్రంథాలయాలు, ఆర్కైవ్స్, ఇతరేతర పత్రాలనుంచి ఆయా ప్రాంతాలలో, ఆయా కాలాలలో వుండిన జీవిత పద్ధతులూ, సాంస్కృతిక చరిత్రలూ మొదలైనవి సంగ్రహించి కథకు రక్తమాంసాలు కూర్చేను. ఇంక సంభాషణలూ, సంఘటనలూ నేనూహించినవి - అన్నారు, ఆయన. మనిషికిలాగే ఘటనలకు కూడా మూలం వుంటుంది. ఏదీ హఠాత్సిద్ధం కాదు - అని చూపిస్తాడు రచయిత.

మనిషి సహజంగా పశుప్రవృత్తి కలవాడు కాదు. ఆయా కాలాలలో వుంటూ వచ్చిన ఆర్థిక వ్యవస్థలే వానిలో సదసత్ప్రవృత్తుల్ని కల్పిస్తున్నాయి. అతడు సహజంగా సామూహిక జీవి. సహకార స్వభావుడూను - అనే భావం ఈ నవలలో సూత్రప్రాయంగా పొడుగునా కనిపిస్తుంది. మనిషిలోని సహృదయతను ఆర్థిక వ్యవస్థ వక్రం చేస్తూంది. నిష్ఫలం చేస్తూందని రచయిత దృక్పథం.

మొత్తం మీద హాలే తన కృషిలో విజయం పొందేరు. కుంటే - హాలే వంశ క్రమమూ, దాని గాథా మాత్రమే కాదు. పెట్టుబడిదారీ విధాన పరిణామ క్రమంలో అమెరికాలో నల్లజాతులకు కలిగిన బాధలు, వారిని పెట్టిన అమానుష హింసలు, వారి తిరుగుబాట్లు, మనుష్యులుగా నిలబడడానికి వారు సాగించిన

అనంత పోరాట గాధల పురాణం మనకు -ఈ రూట్స్‌లో కనిపిస్తుంది.

బానిసల కోసం యూరపియనులు ఆఫ్రికను పశ్చిమ కోస్తా గ్రామాల మీద పడి వేట సాగించిన నాటికే అక్కడ బానిస విధానం అమలులో వుంది. అయితే అది దాని ప్రాథమిక రూపం. తెగల జీవితంలోని నియమ నిబంధనల నుంచి అది విముక్తం కాలేదు. తెగల మధ్యనున్న కలహాలూ, యుద్ధాల ఫలితాలూ, ప్రకృతి వుత్పాతాల వలన వచ్చిన కరువు కాటకాలు ఆ బానిసత్వాన్ని తెచ్చేయి. ఎంతో ప్రాథమిక దశలో వున్నా వ్యవసాయంలో మనుష్య శ్రమ అధికోత్పాదకంగా వుంది. యజమాని తన భూములను బానిసలకు పాలుకివ్వడం ఆచారం. బానిసలు యజమానులు ఒకేచోట కాపురం, ఒకే రకం బట్ట, ఒకే సాంఘికాచారాల పాటింపూ వున్నా క్రమంగా యజమానులు తమకు పంటలో పాలు ఎక్కువ రావాలనడం, బానిసల్ని వూరు బయట వేరే వుంచడం, కొట్టడం అక్కడక్కడ ప్రారంభమయింది. వాని నుంచి బానిసల్ని తెగల కట్టుబాట్లు రక్షించడం సాగుతూనేవుంది. లేనిచోట్ల తిరుగుబాట్లు వస్తున్నాయి. కొట్లాటలూ జరుగుతున్నాయి.

-ఈ దశలో వున్న గ్రామ వ్యవస్థ నుంచి శ్వేతజాతులు బానిసల్ని తెచ్చి అమెరికాలో సంపదల సృష్టికి వుపయోగించేరు. -ఈ నాటి అమెరికా సంపదలకు మూలం ఆ బానిసల శ్రమ శక్తే. -ఈ క్రమంలో ఎంత ప్రాణ నష్టం. ఎటువంటి హింసాకాండ అమలు జరిగిందో వూహించడానికి కూడా సాధ్యం కాదు. కుంటా కింటేను అమెరికాకు తెచ్చిన లార్డ్ లిగొనీర్ 140 మంది బానిసలతో ఆఫ్రికా తీరం వదిలింది. 98 మందిని ప్రాణావశిష్టంగా అమెరికా తీరం చేర్చింది.

-ఈ విధంగా చేర్చినవారు తమ పూర్వస్థితిని మరిచి పోయేటట్లు చేయడానికి, స్వతంత్ర ఆలోచన అనేది పుట్టకుండా చేయడానికి, తమ బానిస స్థితికే సర్దుకుని వుండేందుకు శ్వేతజాతులు మూడు సాధనాలు వుపయోగించేరు. కొరడా, సంస్కృతిని ధ్వంసం చేయడం. మతం. తన పూర్వుల చరిత్రను తవ్వితీయడానికి ఇంత ఉద్వేగమూ, పట్టుదలా, అభినివేశమూ చూపిన హాలే తన నవలలోకి తెచ్చిన అసంఖ్యాక పాత్రలలో క్రియాశీలుర్నిగా సృష్టించిన కోడిపిల్లల జార్జి, ఫిడేలు వాద్యగాడు, టామ్, ఇరినా మొదలైన వారంతా యూరపియన్ రక్తస్పర్శ గలవారే కావడం గమనీయం అనిపిస్తూంది. ఆఫ్రికనులు జడ్డివాళ్లనీ, యూరపియను రక్తంలోనే క్రియా పరత్వం వున్నదనే భావం రచయిత మెదడు అంతరాంతరాలలో లేదు గదా అనిపించింది.

మనిషి సహజంగా మంచివాడు. సహకారజీవీను. ఆర్థిక వ్యవస్థే అతనిలో పశు ప్రవృత్తుల్ని కలిగిస్తూందనే భావం యీ నవలలో చాల బలంగా వచ్చింది.

డాక్టర్ వాల్లర్ చాల మంచివాడు. మానవత్వాన్ని చూపుతాడు. అయితే దయగా ఉండడం వేరు. వ్యవహారం వ్యవహారమే అంటాడు. 700 డాలర్లు తీసుకురా. నీకు స్వాతంత్ర్యం ఇచ్చేస్తానంటాడు డాక్టర్ తన బానిస అయిన ఫిడేలు వాద్యగానితో. వానికా సొమ్ము సమకూడడానికి 15 ఏళ్ళు పట్టింది. ఆ ధనం తీసుకుపోయి ఇవ్వబోతే, అది "ఆ నాటి నీ ధర. -ఈ వేళ నీ ధర

2500 డాలర్లు పలుకుతూంది. తే షో'' అంటాడు. బానిసల మీద కూడా ఎంతో ప్రేమ కనపరిచే డాక్టర్ వాల్లర్ బానిస విధానం రద్దుకు వ్యతిరేకి.

కుంటా కింటే కూతురు కిజ్జీ డాక్టర్ వాల్లర్ అన్న కూతురు అనీ పదేళ్ళ వయసు వచ్చేవరకూ రంగు భేదం ఎరగకుండా ఎంతో ప్రేమతో జంటగా జీవించేరు. కాని, ఆస్తి వ్యవస్థా, దాని ఫలితంగా జీవితంలో ప్రతిబింబించే పరిస్థితులూ వారి మెదడుల్ని ప్రక్షాళితం చేసేయి. యజమాని, బానిస భావాలొచ్చాయి.

అలాగే ఒకనాటి అమెరికా అధ్యక్షుడు జఫర్సన్ బానిసల్ని క్రమంగా విముక్తి పరచి, ఆఫ్రికా తరలించేద్దామనీ, అప్పుడుగాని దేశంలో పెచ్చు పెరిగి పోతున్న తెల్లజాతి నికృష్టులు (ట్రాష్)కు పనీ, తిండీ దొరకదనీ భావించేడు. కాని, శ్వేతజాతి వ్యవసాయదారులూ, బానిస వర్తకులూ మరోలా అభిప్రాయ పడ్డారు. బానిస వ్యాపారం పెరిగి బ్యాంకులూ, పెద్ద పెద్ద కంపెనీలూ దానిని కట్టుదిట్టంగా నడిపించడానికి పూనుకున్నాయి.

అయినా బానిసత్వం అమెరికాలో రద్దు అయింది. రద్దు కావడానికి ప్రధాన కారణం బానిసత్వం ఆర్థిక వ్యవస్థకు పరిపుష్టినిచ్చే స్థితిపోవడం, శ్వేతజాతినే హీనపరిచే పరిస్థితులను కల్పించడమూ దాని రద్దుకు కారణమయ్యాయనే భావాన్ని అలెక్స్ హాలే తన నవలలో చూపించేడు.

బానిసలు వ్యవసాయపు పనిముట్లు విరిచేసేవారు. పని దొంగలయ్యారు. యజమాని కుటుంబాలలో వంటవాళ్ళుగా వుండి వంటకాలలో అశుద్ధాలు కలపడం, విషాలు చేర్చడం వగైరా చర్యలతో కసి తీర్చుకోవడం సాగించేరు.

క్రమంగా బానిసల్ని వ్యవసాయం మొదలైన ఉత్పత్తి రంగాలకు గాక, ఆంబోతుల్లాగా సంతానోత్పత్తికి, బాక్సింగ్ మొదలైన వానిలో పెట్టి వినోదానికి తయారు చెయ్యడం ప్రారంభమయింది.

రెండో వేపున శ్వేతజాతిలో నికృష్టులుగా (ట్రాష్) పిలవబడే వర్గం విస్తరించ సాగింది. అది సమాజాన్నే నికృష్టస్థితికి తెచ్చేంతగా పెరిగింది.

సమాజాన్ని క్షీణత్వానికి నెట్టుతున్న బానిసత్వపు అవలక్షణాలు శ్వేత జాతీయులలో మానవత్వాభిమానాన్ని పెంపొందించేయి. ఎనభయ్యేడేళ్ళ క్రితం తమ పూర్వులు ఈ ఖండంలో నూతన స్వతంత్ర జాతిని సృష్టించేరని, మానవు లంతా సమానులే నన్న భావానికి దానిని అంకితం చేశారని (గెట్టిస్ బర్గ్ లో అబ్రహం లింకన్ ప్రసంగ వాక్యం) గుర్తు చేసుకొనేందుకు తోడ్పడ్డాయి. ఆ విధానం రద్దు ఫలితంగా చెలరేగిన అంతర్యుద్ధంలో నల్లజాతి వారి చేతిలో అయుధాలు పెట్టాయి.

రెండు శతాబ్దాల అమెరికా అభివృద్ధి పరిణామాలను చరిత్రలా గాక, నవల రూపంలో మన ముందు పెట్టి వాని భయంకర రూపాన్ని చూపడంలో హాలే కృతకృత్యుడయ్యేడు. రూట్స్ మన మన్సుల్ని కలిచి వేయగలగడానికి అదే కారణం.

# వి. ఎస్. ఖడిల్కార్

## జ్ఞానపీఠ బహుమతి పొందిన నవలాకారుడు

జ్ఞానపీఠ అవార్డు 1975 లో లభించిన నవల 'యయాతి' ఒక్కటే శ్రీ. వి. ఎస్. ఖడిల్కర్ రచనలతో పౌరాణికం. యయాతి, శర్మిష్ఠ, కచ, దేవయాని — ఈ నలుగురిమధ్య సాగిన పౌరాణికనవల ఆత్మ, పూర్తిగా సామాజికం అన్నారు రచయిత. కామం, అణచుకోలేని కామోద్వేగం. ఈర్ష్య, ద్వేషం, ఆశ, మోహాల కథయిది. మహారాష్ట్ర భాషలో విశేష ప్రచారం, ప్రజాదరం ఈ నవల పొందినా తాను వ్రాసిన 'ఉల్క', 'ధనధృవ', 'క్రౌంచవధ' ఆయన అభిమాన రచనలు.

రచయితకు సమాజంలో నిబద్ధత వుండాలన్నారు శ్రీ ఖడిల్కర్, - నిబద్ధత రచన శ్రేష్ఠత్వంలో లేదు. రచయిత హృదయంలో వుంటుంది.

రచయిత స్వభావం, సంస్కారం పట్టి అతని నిబద్ధత వుంటుంది. అతడు సమాజంలో సభ్యుడు. సభ్యుడే కాదు. మార్గదర్శి, మహర్షి:

''దళిత సాహిత్యంలో అసమ్మతి వుంది. దానిని మనం హర్షించాలి, అది గొప్పగా లేక పోవచ్చు. సాహిత్యపు విలువలు చెప్పదగినంతగా లేక పోవచ్చు. కాని, దానిలో నిబద్ధతవుంది.

''1947 కు పూర్వం స్వాతంత్ర్యం సాంఘిక సంస్కరణ, - ఈ రెండే సాహిత్యంలో వస్తువు. స్వాతంత్ర్యం వచ్చేక సాంఘిక విప్లవం. సంస్కరణ కాదు - ఒక్కటే వస్తువు అంటారు శ్రీ ఖడిల్కర్. ''రచయిత మానవుని పోరాటాన్ని చిత్రించాలి. ... ''ధనికులు, బీదలమధ్య పెద్ద అంతరం. అగాధం వుంది. తరతరాలుగా దళిత జాతుల్ని దుక్కిటెద్దుల్నిగా ఉపయోగించుకొంది సమాజం, అది మహా అన్యాయం. ఇంక అది సాగకూడదు. ... సాహిత్యం ఈ అట్టడుగు మనిషి తనను గురించి ఆలోచించు కొనేలా చెయ్యాలి. శాస్త్ర - సాంకేతిక విప్లవం విస్తరించిన ఈ శకంలో మూఢాచారాలు, శకునాలు, జ్యోతిషాలు పాటించడం భయంకరం. వాటిని మార్చడానికి రచయిత సాయపడాలి. ...మన రచయితలలో చాలామంది పాశ్చాత్య పరిస్థితుల చిత్రణ ననుకరిస్తారు. అసలు మనం వ్రాయవలసిందీ, చిత్రించ వలసిందీ మన పరిస్థితులు'' అన్నారు ఖడిల్కర్.

బీదలు జీవనం కోసం, మానవ హక్కుల కోసం, మానవ విలువల కోసం జరుపుతున్న పోరాటాన్ని చిత్రిస్తున్నాయి ఆయన ఇతర నవలలు 'ఉల్క', 'ధనధృవ'.

''క్రితం రచయితలు సంఘసంస్కరణల కోసం వ్రాశారు. ఇప్పుడు చేయవలసింది, మానవ పోరాట చిత్రణ. ఉన్నత, మధ్యతరగతుల వారిలో సిగ్గులేమి మహా విచారకరం. బీదలకు చదువుకొనె అవకాశం లేదు'' అన్నారు ఖడిల్కర్.

ఇది ఖడిల్కకుర్ బహుమతి తెచ్చిన నవల అయినా, జనబాహుళ్యంలో ఆయనకు పేరు తెచ్చినది 'రూపక కథ.' ఇందులో ధ్వని ప్రధానం. దండి సత్యాగ్రహ యాత్ర గురించి వ్రాసిన 'సాగర! అగస్త్య అలా' దానికి ఉదాహరణ. వ్యంగ్యంతో కథా విషయాన్ని సూచిస్తారు. ఉపమానాలు, రూపకాలుతో కథను కవితలా నడపడం ఆయనకు సహజ విద్య.

''భౌతిక, ఆత్మిక ప్రపంచాలమధ్య సమతూకం వుండాలి'' అంటారు ఆయన.

జాతీయోద్యమంలో పాల్గొన్నారు. షిరోడే గ్రామంలో బడి పంతులుగా జీవించారు. కథారచయితగా, నవలా రచయితగా విశేషప్రఖ్యాతి పొందేరు.

''నేను విచారపడవలసిన దేమీ లేదు.'' అన్న పూర్ణ సంతృప్తితో తమ 78 వ ఏట, 1976 లో కన్నుమూశారు, శ్రీ వి. ఎస్. ఖడిల్కర్. ఆయన జ్ఞానపీఠ బహుమతిని తెచ్చిన 'యయాతి'ని క్రి. శే. జగన్నాధ్ తెనిగించారు. అ ముద్రితం.

# 'బ్లాక్ అవుట్'

**కథానిక**

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

పాతకాలం వారు సినిమాకు వెళ్ళడం అరుదు. ముఖ్యంగా మా నాన్న గారు చూసిన సినిమాలు వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. ఎప్పుడైనా మంచి సినిమా వచ్చినప్పుడు బ్రతిమాలితే, ఆయనకి మూడ్ వుంటే వస్తారు.

ఆ రోజు ఏ కళనున్నారో, సినిమాకి రమ్మని పిలిస్తే వెంటనే బయలుదేరారు. ఇంగ్లీషు సినిమా అది. పేరు, 'వేర్ వర్ యు వెన్ ది లైట్స్ వెంట్ అవుట్' (లైట్లు పోయినప్పుడు నువ్వెక్కడున్నావ్?)

కరెంటు పోవడం మనకి సర్వసాధారణం గాని, న్యూయార్క్ మహా నగరంలో, విద్యుత్ సరఫరా పోవడం ఎన్నడో గాని జరగనిది. కరెంట్ లేని ఆ నగరం, నిప్పు ఇంకా కనుక్కో బడని పాత రాతి యుగంలా అనిపిస్తుంది.

1965లో విద్యుత్ సరఫరా కొన్ని గంటల పాటు స్థంభించి నప్పుడు, న్యూయార్క్ నగరంలో జరిగిన సన్ని వేశాలనేకం కలిపి కథగా అల్లి ఆ సినిమా తీసారు.

టిక్కెట్లు కొనుక్కొని వెళ్ళాం. న్యూస్ రీల్ తరువాత సినిమా మొదలైంది. నవనాగరికంగా, విద్యుత్ ద్వారా అనేక యంత్రాలు పనిచేయించి తమ శ్రమని తప్పించుకొనే ఆ నగరవాసులు విద్యుత్ లేకుండా పడే అవస్తలు అద్భుతంగా చిత్రీకరించిన ఆ సినిమాలో లీనమై పోయాం.

ఇంతలో హఠాత్తుగా కరెంటు కట్ అయిపోయింది. తెరమీద బొమ్మ అదృశ్యమై పోయింది. కరెంటు పోయింది!

ఇప్పుడొస్తుందంటే ఇప్పుడొస్తుందని గంట పైనే వేచిచూశాం. తర్వాత గేట్ పాస్ తీసుకొని ఇంటి దారి పట్టాం. మర్నాడు ఏ ఆటయినా చూడొచ్చుట.

ఇంటికి చేరుకున్న తరువాత లైట్లొచ్చాయి. మళ్ళీ ఆ సినిమా చూసే అవకాశం కల్గలేదు మాకు, ఆ రోజే ఆఖరు ఆ సినిమా.

కథానిక సి. డి. ప్రసాద్

# "రోగంవస్తే బాగుండు రోగం కుదుర్తుంది"

రావూస్ ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌లో ప్రత్యేకమైన గదిలో మంత్రి గారు చికిత్సతీసుకొంటున్నారు. డాక్టర్ రావు గవర్నమెంటు ఆస్పత్రిలో పని చేస్తూ ఒక ప్రైవేట్ క్లినిక్ నడుపుతున్నారు. ఆ క్లినిక్ ఆయన పేరుమీద ఉందో, ఆయన తమ్ముడి పేర ఉందో గాని రావుగారే అక్కడ డాక్టరని అందరికీ తెలుసు.

గవర్నమెంటు ఆస్పత్రి స్కెలిటన్ స్టాఫ్‌తో నడుస్తుంది. అక్కడ డాక్టర్లు, నర్సులు, తోటీలు, దాదాపు అన్ని రకాల వాళ్ళు నెల రోజులుగా స్ట్రైక్‌లో ఉన్నారు. కారణం మామూలే. అవసరాలకు సరిపడిన వేతనాలు ఇమ్మని. మంత్రి గారు కూడా మామూలు కారణాలు చెప్పి బిగతీసుకున్నారు. 'ప్రభుత్వానికి డబ్బులేదు. పయిగా అత్యయిక పరిస్థితి. సానుభూతికేం కొదవ లేదు. ఇప్పటికే ఇస్తున్న వేతనాలు చాలా మందితో పోలిస్తే ఎక్కువ. ఇదే పని చేస్తు ఎక్కువ వేతనాలు తెచ్చుకొంటున్న వాళ్ళలో పోల్చుకోవడం దేశభక్తి కల వాళ్ళు చెయ్యవలసిన పని కాదు. దేశద్రోహుల వలలోంచి తప్పుకొని అరాచక శక్తులు పన్నుతున్న ఉచ్చుల్ని అర్థం చేసికోవలసిందని హితవు''.

మంత్రి గారు వారం రోజులుగా ఆస్పత్రిలో ఉన్నారు. ఆయనకి నర్సులు, డాక్టర్లు చేస్తున్న సేవలు, ఉచ్చ దగ్గిర్నుంచీ ఎత్తి పారపోస్తున్న తోటీ చాకిరీ అన్నీ అర్థం అవుతూనే ఉన్నై. అలాంటి వాళ్ళకి కాస్త వేతనాలు పెంచడంలో బేసబబేమీ లేదని ఆయన మనస్సు అంగీకరించింది. తోటీని పిలిచి అడిగాడు జీతం ఎంత అని. అతను చెప్పింది విని ఆయన మనస్సు దిగ్భ్రమ చెందింది. గవర్నమెంటు ఆస్పత్రిలో ఇస్తున్నదాని కన్నా తక్కువ. అసలు గవర్నమెంటు ఆస్పత్రిలో ఇస్తున్నదే తక్కువ అని గదా సమ్మె! అదేగా తానూ చెప్పుకొంటున్నది.

రావుగారొచ్చినప్పుడడిగాడు "ఇదేం అన్యాయమయ్యా, మరి నువ్వు కూడా సమ్మె చేస్తున్నావ్ కదా జీతాలు పెంచాలని. ఇక్కడ వాళ్ళకింత తక్కువేమిటి? పయిగా నీ చార్జీలు కూడా స్పెన్సరు రేట్లాయె. రావుగారు నవ్వాడు. దానర్థం ఆ ఇచ్చిందానికే తృప్తపడి పనిచేసే తోటీలు బోలెడుమంది దొరుకుతారు. అని. అదీగాక పేషెంట్లు దగిర నుంచీ వాళ్ళకి దండిగానే దొరుకుతుంది. పేషెంట్లు ఇవ్వగలవాళ్ళే. మంత్రిగారు నవ్వాడు. 'ఇలా నాలుగురోజులు జరిగితే ప్రకాశం ఊరుకోడయ్యా. మీ తోటీల్ని ఆర్గనైజ్ చేసి యూనియన్ లేవదీస్తాడు' అంత వరకూ లాక్కండి'' అని సలహా ఇచ్చాడు. ప్రకాశం అంటే ఇప్పుడు ఆస్పత్రి అన్ని రకాల వాళ్ళని ఒక్క తాటి మీద నడిపిస్తున్న నాయకుడు. డాక్టర్లకే ఆయన మద్దతు ఉంది. రావుగారు మళ్ళీ నవ్వారు. 'ప్రకాశం మన

జోలికి రాడులే' అన్న విశ్వాసం ఆ నవ్వులో కనబడింది మంత్రి గారికి.

ఊరికే బెడ్ మీదే ఉంటంవలన మంత్రిగారికి పాపం మంచి ఆలోచన లొస్తున్నై. బడుగు జనం మీద అంత నిర్దయ పూనడం పెద్ద గొప్ప అనిపించ లేదు ఆయనకు. ఏదో రకంగా సమ్మె అంతం అయ్యేలా చూసి వాళ్ళు అడిగిం దేదో ఇస్తే? అది మహా ఎంతగనకా! బాగుందనిపించింది. కాని దానికి ఒకటే అడ్డు. ప్రకాశం, అతని యూనియన్ అవతల పార్టీ. సమ్మె అవతల పార్టీ పొలిటికల్ గైన్స్‌కోసం నడిపిస్తోంది. ఆ విషయం గుర్తుకు రాగానే మంత్రిగారి జాలి హారతి కర్పూరంలా హరించు కొని పోయి కోపం వస్తుంది, దాంతో మూలుగు వచ్చి కళ్ళుమూసుకున్నారు. ఉద్రేకం మంచిది కాదన్న డాక్టర్ సలహా నెమరేసుకొని ఆలోచనలు మానే ప్రయత్నం చేశాడు. సిస్టర్ వచ్చి 'హైరాన పడకండి' అని చెప్పి నిద్ర మాత్ర ఇచ్చి వెళ్ళి పోయింది. మంత్రి గారికి నిద్రపట్టింది.

ఆయనకి మెలకువ వచ్చి చూసే సరికి ముందు కలా అనిపించింది. ఆ తర్వాత నమ్మక తప్పింది గాదు. పక్క బెడ్ మీద ప్రకాశం ఉన్నాడు. డాక్టర్ రావ్ అతని పక్కనే నిల్చుని చూస్తు న్నాడు పల్సు. ప్రకాశం మత్తులో ఉన్నాడు.

పది రోజుల బట్టీ ఇద్దరూ అలా ఆ గదిలోనే ఉన్నారు ముక్కుల్లో గొట్టా లతో. మాట్లాడ వద్దని డాక్టరు చెప్పినా వాళ్ళు ఏదో మాటాడు కొంటునే ఉన్నారు. దట్టమైన పొరలు మంచులా కరిగిపోయి వాళ్ళు అనేక విషయాల మీద తమ అభిప్రాయాలు దాదాపూ ఒకటే అని గ్రహించుకున్నారు. ప్రకాశం మంత్రిగారి స్థానంలో ఉంటే ఇప్పటి మంత్రిలాగే ప్రవర్తించే వాళ్లనీ, మంత్రి గారు ప్రకాశం స్థానంలో ఉంటే అచ్చం ప్రకాశంలోనే నడిచేవాళ్ళనీ అను కొన్నారు. ఇద్దర్ని ఎరిగిన 'రావ్' బల పరిచాడు. "మీ రిద్దరూ మనుష్య ప్రకృ తులుదృష్ట్యా ఒకేరకం మంచి వాళ్ళు గూడా– అయితే రాచకీయాల అవసరం దృష్ట్యా భిన్న ధృవాలు" అన్నాడతను. రాచకీయాలు మానవత్వాన్ని మంట కలపాలా? అన్న ప్రశ్న ఆ ముగ్గురి మధ్య అలాగే నిలిచి పోయింది.

సమ్మెవల్ల సామాన్యజనం ఎన్ని కడగళ్ళకి లోనవుతోందో –ఖరీ దయిన క్లినిక్‌లో వాళ్ళు ముగ్గురూ చాలా సందర్భాల్లో ముచ్చటించు కున్నారు. ఎవరికి వాళ్ళే అవతలి వాళ్ళు కారణం అనుకొంటునే, ఎవరికి వాళ్ళం హిపొక్రాట్స్‌లా ప్రవర్తించటం లేదా అన్న అనుమానం కూడా వాళ్ళకి రాక పోలేదు.

పరిస్థితిలో మరో అవాంతరం వచ్చింది. ఆక్సిజన్ కంపెనీ సమ్మె ఆరం భం కావడంతో రావుగారి క్లినిక్‌కు కూడా ఆక్సిజన్ అందని పరిస్థితివచ్చింది. ఆ సమ్మెదారులు ఎవరి మాటలు విన కుండా, మొండిగా సమ్మెలోకి దిగారని, ముందు నోటీసు గూడా ఇవ్వలేదని పత్రి కలు రాశాయి. ప్రజలకి ఊపిరి ఆక్సిజన్. అలాంటి ఆక్సిజన్ ఉత్పత్తిలో సమ్మె పరిస్థితిలోనూ సహించదగింది కాదనీ – అసలు అవసర పరిశ్రమల్లోనూ, విభాగాల్లోనూ సమ్మె హక్కు తొలగిం

చాలనీ పత్రికలు సంపాదకీయాలు రాశాయి.

వాళ్ళు సమ్మె విరమించనున్న ఒక పత్రం మీద మంత్రిగారు సంతకం చేశారు. ప్రకాశం చెయ్యలేదు. డాక్టరు గారు చేశారు- తమ సమ్మెకీ, సమ్మెకీ తేడా ఉంటుందనీ, స్కెలిటన్ సర్వీస్ తాము నడుపుతున్నామనీ, అలాంటిది సమ్మెదారులు ఏవీ చెయ్యడంలేదనీ ఒక వివరణ గూడా చేర్చి. ఆ వివరణ చూడగానే ప్రకాశం కూడా సంతకం అంటించాడు.

అయితే ఆక్సిజన్ సమ్మె ఆగలేదు. వాళ్ళ కారణాలు వాళ్ళకున్నై. ఎంత ప్రాణ వాయువు ఉత్పత్తిచేసినా, వాళ్ళ బతుకులూ అందరిలాంటివేగా. రావుగారి ఆస్పత్రిలో ఆక్సిజన్ సిలెండర్లు తక్కువ స్టాకులో ఉన్నై. గవర్నమెంటు ఆస్పత్రిలో ఈ మధ్య వాడకం లేదు కాబట్టి చాలా ఉన్నై, కానీ వాటితో కూడా తాళం చెవులు సమ్మె తీవ్ర మయిన రోజున ఎవరో కాజేసి మళ్ళీ ఇవ్వలేదు. ఆ రహస్యం, వాటి ఉనికీ ప్రకాశంకీ తెలుసు, రావుగారికీ తెలుసు. మంత్రిగారు మౌనంగానే మీ యిష్టం, నేను కళ్ళు చెవులు మూసుకున్నానన్న భంగిమ పెట్టారు. దాంతో నాలుగు రోజులు రావ్‌గారి ప్రత్యేకమైన పేషెంట్లకు ఆక్సిజన్ అందతూవచ్చింది. కానీ రహస్యం దాగేలాగ లేదు. సమ్మెదార్లలోనూ లక్ష చీలికలున్నై. అందుకని ఆ తాళం చెవులు మళ్ళీ వాటి స్థానంలోకి వెళ్ళిపోయినై.

గొట్టాలు తీస్తే ఊపిరాడని రోగం వాళ్ళవి. ఒక రోజు ఉన్న ఒక్క సిలెండరూ మంత్రిగారూ, ప్రకాశం ముందు మీరంటే మీరని అనుకోవడం విన్న రావ్‌గారు తన పాత్ర ఏమిటి ఈ నాటకంలో అనుకోక ఒక తప్పింది కాదు.

ఆ రోజు అనుకోంది తటస్థించింది. రావుగారి ఆస్పత్రిలోని తోటీలు రాలేదు. వాళ్ళకొక చోటా నాయకుడు దొరికాడు. రావ్‌గారు అదిరి పోయ్యారు. ప్రకాశం చోటా నాయకుణ్ణి పిలిచి మాట్లాడాడు. తను బయటికి వచ్చింతర్వాత ఈ విషయం పరిశీలిస్తానని అన్నాడు. చోటా నాయకుడి కిది నిచ్చెనలాంటి సమయం అనిఅర్థమైపోయింది. పరిస్థితి చెయ్యిదాటి పొయ్యేలోగానే నీళ్ళుచల్లడం మంచిదని మంత్రిగారూ, ప్రకాశం రావుగారికి నచ్చ చెప్పి వాళ్ళ జీతాలు పెంచేలాచూశారు. రావుగారు కొంచెం వెటకారంగా "మీరిక్కణ్ణుంచి త్వరగా కదలండి. లేకపోతే మా క్లినిక్ మూత పడుతుం" దన్నారు.

అలాగే కదలక తప్పింది గాదు. ఎందుకంటే ఇద్దరికే కొంచెం మేజర్ టెస్ట్‌లూ, ట్రీట్‌మెంటూ అవసరం అని తేలింది. ఆ సౌకర్యాలు గవర్నమెంటూ ఆస్పత్రి,లో గాని దొరకవు.

గవర్నమెంటు ఆస్పత్రిలో చేరిన

### చిరునామా మార్పు

'అభ్యుదయ' కు సంబంధించిన ఉత్తరాలు, పంపే రచనలు : మనిఆర్డర్లు, డ్రాఫ్టులు, చెక్కులు మొదలైనవి యీ దిగువ చిరునామాకు పంపవలసిందిగా విజ్ఞప్తి.

ABHYUDAYA,
R - 3, Llyods Estate,
Madras – 600 014

తర్వాత 'స్కెలిటన్ సర్వీస్' ఎలాంటిదో మంత్రి గారికీ, ప్రకాశంకీ అర్థం అయింది. రావ్‌గారి 'ఆర్గ్యుమెంటు' రావ్ గారికే బోధపడింది, ఇదివరకు వాళ్ళకు అర్థం కాలేదని కాదు. ఇప్పుడనుభవం లోకి వచ్చింది. తన వొంటిమీది పుండు బాధ తనకు తెలిసినట్లు!

దేశభక్తులయిన మంత్రిగారికి వైద్య సదుపాయం అందటం లేదని, బయట ఆయన పార్టీ వాళ్ళు అరుస్తున్నారు. కార్మిక నాయకుడికి కావాలనే వైద్యంలో తాత్సారం చేస్తున్నారని ఆయన పార్టీ వాళ్ళు సమ్మెలో మరో నినాదం లేవదీశారు.

వైద్యం అత్యవసరం అయినా, అందడంలేదని మంత్రిగారూ, ప్రకాశం బయట పడకపోయినా, రావు గారు మాత్రం చెయ్యిదాటి పోతోందని దిగులు పడడం వాళ్ళు విన్నారు.

ఏదో తీగెలు కదిలినై. ఏవో విమానలు వచ్చినై. సమ్మె అందరికి సమ్మతం అయ్యేలాగా ముగిసింది. అవతల ఆక్సిజన్ సమ్మె కూడా సద్దుమణిగింది.

మంత్రిగారనుకున్నారు, మళ్ళీ బయటికి వచ్చింతర్వాత ప్రకాశం ఇంత సబబుగా ప్రవర్తిస్తాడాఅని. ప్రకాశం మెదడు మంత్రిగారికి మెదడు అద్దం అసలు దేశం అంతా ఒక పెద్ద రోగం వచ్చి ఒక వారం రోజులు అలమటిస్తే బాగుండని పించింది. అప్పుడు అందరూ సర్దుకుంటారేమో. యుద్ధం అనేకరకాల ఐక్యతని తీసుకురావడం అనుభవం కదా.

యుద్ధమూ, రోగమూ మాత్రమే పరిష్కారమార్గాలయిన దేశంలో జనం మాత్రం ఆ రెండూ కాకుండా పరిష్కారం రావాలని ఆశిస్తోంది. అందుకే ఆస్పత్రిలో మిగతా పేషేంట్లు కొందరు ఇద్దరూ కొంత కాలం పాటు ఆస్పత్రిలోనే ఉండిపోతే బాగుంటుంది, దేశం బాగుపడుతుంది అనుకున్నారు.

గమ్మ మిటంటే మంత్రిగారూ, ప్రకాశం అలానే అనుకుంటున్నారు. "కాస్త ప్రాణం తెరిపిన పడుతుంది. బయట జంజాటంలోంచి తప్పుకొని ఇక్కడే నాలుగురోజులు విశ్రాంతి తీసుకొంటే అని". వాళ్ళ కర్థం కాంది ఒక్కటే. అప్పుడే, బయట మరో ప్రకాశం వస్తున్నాడు. మరో మంత్రి వస్తున్నాడు. "స్వార్థం కోసం నలుగురి ప్రయోజనాల్ని నాశనం చేసే మంత్రి, ప్రకాశం గూడు పుఠాణీ చేశారని" చాటుకొంటూ రావు గారు అరుస్తున్నారు.

ఇంద్ర ధనుస్సు, దానికి ప్రతిగా వచ్చిన తలకిందులు ఇంద్ర ధనుస్సు అన్నీ కలిసి వొచ్చేలా వర్షం కురుస్తుంది.

## జీవన్మృతుడు

పులిచేరి రామమోహనరావు

నేటి సమాజంలోని
సగటు మనిషి.
సగం చచ్చినవాడి క్రిందలెక్క!
తాను బ్రతికివున్న
ఘడియలు కాస్తా
జీవికను వెతుక్కోవటంలోనే
వ్యయమయిపోగా -
ప్రతి రాత్రి అతను నిద్రలో చస్తాడు;
ఉదయమే పునర్జీవితుడై
సమాజపు పల్లకి కొమ్మును
భుజాని కెత్తుకుని
పనిలోకి వెళ్ళిపోతాడు.

## చరమ గీతం

అనువాదం

డా॥ పుప్పల లక్ష్మణరావు

నిక్సన్, ఫ్రెయ్, పినో ఛె!
నేటి వరకూ,
పంథొమ్మిది వందల డెబ్బైమూడు
సెప్టెంబరు వరకూ -
ఈ తిక్త మాసం వరకూ
మీ మోచేతి కింద నీళ్ళు తాగిన
బోర్డబెర్రీ, గర్రస్టాజూ, బంజెర్!
మా చరిత్రలో తిండిపోతు సివంగులు!
కొలలేని మా నెత్తురుతో,
జమీల నేలని బురదచేసి,
పెను మంటలతో జమీ నేలని దగ్ధంచేసి
మేం జయించిన పతాకాలని కొరికిన
పంది కొక్కులు!
నరకం నుంచి దాపురించిన
నర రాక్షసులు!
న్యూయార్కు వృకాల పుసి కొల్పుల
ఫలితంగా
వేవేలసార్లు శరీరాలు అమ్ముకున్న
క్షాత్రపు విక్రేతలు!
తోడిప్రజలు ధారపోసిన త్యాగాలతో
డాగులు పడిన
డాలర్లకోసం
అవురావురంటూన్న మానవ
యంత్రాలు!
అమెరికన్ మెతుగలకి
రంకుపోయిన బేహారులు!
ఖూనీలకై దప్పిగొన్న చిత్తడి నేలలు!
చిత్రహింసల రూపంలో
ఆకలి అవతారాలై వెలసి
ప్రజలని కమ్మీలకి బలిచేసే
ఏకైక శాసనంతో యేలుతూ
అమెరికన్ గాలికి ముండలమారులైన
అతిరథులు!

## ప్రేమ గీతం

అనువాదం

మోహన్

ఈ రాత్రి విషాదాలు చీల్చి
గీతాశ్రు మాల అల్లగలను
ఆకాశం పగిలిందని
చుక్కల చెక్కిళ్లు వణికి
సుదూరాన కరిగాయని
రాత్రి గాలి రివ్వుమంది.
ఆకసాన పాడుతోంది
ఈ రాత్రి విషాదాన్ని రగిల్చి
కలల మంటవేయగలను...
మెరిసే ఆ నిశ్చల విశాల
నేత్రాల సుందరిని
ప్రేమించక పోవడం
ఎవరి తరం?
ఆమె నాకిక లేదను కోవటం
ఆమె నాదిక కాదనుకోవటం
అంతులేని ఈ రాత్రి
బరువు మోయటం
ఒంటరిగా చీకటి బరువు
నీడ్వటం
ఎలా, ఎలా, ఎలా?

అంతలేసి ఆ కన్నులు
నిశ్చలమై నిలచినప్పుడు
ఎంతలేసి వారయినా
ప్రేమించక తప్పదు
ఈరాత్రి ఎదపై కుంచెతో
చిత్రాల వ్యథను చింద గలను
ఈ రాత్రి విషాదాలు చీల్చి
గీతాల మాల లల్లుతాను
చిమ్మ చీకటిరాత్రి
ఛిన్నాభిన్న మయ్యిందనీ,
నీలినీలి చుక్కలు
చెదరి పోయాయనీ
రాత్రి గాలి యీల వేస్తోంది
రివ్వురివ్వున
ఆనందాలు పాడుతోంది
ఆకసాన
ఈ రాత్రి వ్యథల్ని రేపి
కూలదోస్తాను కలల గూళ్లు.

## అస్థి 'పంజరాలు' . . . . ఎస్. హరగోపాల్

రాళ్ళు పగల గొట్టే వాళ్ళు
పునాదులు కట్టే వాళ్ళు,
భవంతులు నిలబెట్టే వాళ్ళు
రాళ్ళు, సున్నం
ఇటుకా, మన్నుల్లాగా
'పనికి' వచ్చే వాళ్ళు
కూలోళ్ళు.

వాళ్ళ కండరాల కలిమి,
వాళ్ళ శక్తుల బలిమి,
వాళ్ళ 'ఆకలి చెలము' ల్లో
దాహానికి నీళ్ళు పుట్టించుకోలేవు
వాళ్ళ గుండెల్లో చెరువు
కన్నీళ్ళు కూడా యింకిన బీళ్ళు,
పేదోళ్ళు.

పునాదుల మీద భవనాలు,
శవాల మీద సమాధులూ
వీళ్ళు చేసే పనే
అందరికి అందాలు ఆనందాలు యిచ్చేది
వీళ్ళ 'రెండు రెక్కలే'!

అయినా వీళ్ళు
కూలిన గుడిసెల్లోపల
కాలే కడుపుల్తో, బాధల్తో
రేపటి కోసం రోజూ
వంటిబొక్కలు సాగదీసే అస్థిపంజరాలు
మెతుకులు దులిపేసిన పులిస్తరాకులు.

(కాలనాళికకు సంబంధించినది) "యిది యావత్తూ ప్రజాధనాన్ని పెద్దగా దండగ చెయ్యడమే ననీ, దాన్ని గురించి మనం జరిపిన చర్చలు మన కాలాన్ని పెద్దగా దండగ చేసుకోవడమేననీ నాకు నమ్మకం కలిగింది. ఈ నాళికను పాతిపెట్టడం, ప్రథమంగా తెలివి తక్కువ; యీ పత్రాన్ని రహస్యంగ వుంచడం మరిన్నీ! యీ విషయాన్ని గురించి మనకు యిన్ని అనుమానాలు, వాదోప వాదాలూ రానట్టయితే, దానిని బయటికి తీయడం యింకా తెలివి తక్కువ పని అని చెప్పివుండే వాణ్ని."

**(కాలనాళికలో వుంచిన చారిత్రక సమాచార రచయిత డాక్టర్ ఎస్. కృష్ణస్వామి)**

# ఘోర విపత్తు

కథానిక

చామర్తి దుర్గాప్రసాద్

"ఏమిటి బాబాయ్ కార్లు తిరణాల్లో ప్రభల్లా పోతున్నై" అడిగాడు పొలం దున్నుకుంటున్న రైతు వెంకయ్య, రోడ్డుమీద పోతున్న మునసబుని కేకేసి "నీకు తెలీదట్రా వెర్రి వెంకన్నా! మన ప్రియతమ నాయకుడు ఆస్పత్రిలో ఉన్నాడ్రా. పెద్దాసుపత్రికి ఇదే గదరా తోవ - అదీ కత" అనేసి మునసబు గారు దారే పోతున్న కారాపేసి ఎంచక్కా కూచుని చక్కా వెళ్ళిపొయ్యారు. పోతూ పోతూ ఓ పాలి కేకేశారు, "నెల రోజుల బట్టీ పన్లవీ కట్టేసి ఆయన ఆరోగ్యం కోసం తిరుగుతున్నాంరా. నువ్వే మాత్రం అరక వదలవ్ -సరేగాని నీ చిన్నోడున్నది ఆసుపత్రి లోనేగా చూసొస్తాన్లే". వార్డు నంబరు కూడా కనుక్కోకుండా పోతున్న మునసబు గారు ఎలా చూడగలరని వెంకన్న సందేహించలేదు. ఎందుకంటే చిన్నోణ్ణి చేర్పించిన కరణం గారూ ఆ కార్లోనే మునసబుగారి వెంట వున్నారు.

ఆ నాయకుడికి తొంభై ఏండ్లు దాటి వుంటాయి. వార్ధక్యం వచ్చినా నవ యువకుడిలా వుంటారనీ ఎవర్ గ్రీన్ అని పేపర్లు ఆయన్ని గురించి రాస్తుంటాయి. రాజకీయాల్లో ఆయన పండిపోయినా, ఎప్పుడూ ఆకుపచ్చని దొరకాయలాగే ఉంటారట ఆయన. మెదడు, అవయవాలు అన్ని చురుగ్గా పనిచేస్తున్నై అని, ఆయనపోతే దేశంలో మరో నాయకుడు లేడని పత్రికలు ఘోషిస్తున్నాయి. ప్రార్థనలు, యజ్ఞాలూ ఒకటేమిటి - దేశమంతా ఆయనకోసం దేవాలయమై అభిషేకాలతో తడుస్తూంది.

నెలరోజులనుంచీ ఆయన కోమాలో ఉన్నారు. ఆస్పత్రి చుట్టూతా గదుల్లోనూ, అటూ ఇటూ ప్రాంక మైళ్ళలోపున ఉన్న అన్ని హోటళ్ళలోనూ నాయకులు బసచేశారు. ఆయన కన్ను మూయరాదు. మూస్తే దేశం ఘోరమయిన విపత్తులో పడిపోతుంది.

ఆయన కోమాలో వున్న ఈనెల రోజులు మాత్రం నిజంగా దేశం విపత్తులో ఉన్నట్లేఅనిపించింది. ఆఫీసులు పని చెయ్యటం లేదు. మంత్రులు ఫైళ్ళు చూడడం లేదు. అసెంబ్లీలు నిరవధికంగా చచ్చిపోయినై.

ఇది పెద్ద విపత్తు కాదనే అనిపించింది మునసబుగారికి అంతరంలో. ఎందుకంటే ఇదివరకు లాగానే వస్తువులు అధికధరల కయితేనేం దొరుకుతూనే వున్నవి. తామందరూ ఆస్పత్రి చుట్టు వున్న హోటళ్ళల్లో ఎప్పుడు పడితేఅప్పుడు ఏదిపడితే అది తింటూనే వున్నారు. నిజంగా విపత్తు తన సహా విని వెంకయ్య అరక మానేసిన రోజున వస్తుందని ఆయన అనుకున్నాడు కానీ పైకి అనలేదు. "ఎప్పటికీ గండం గడిచేను" అని బయటికే మొక్కు కొంటున్న కరణంగారితో గొంతు కలిపేరు ఆయన.

"ముసిలివద్దు ఆయనపోతేనేం దేశం గొడ్డుపోయిందా? ఆయన పుట్టకముందు దేశం ఏమయింది. అదే ఆ తర్వాత అవుతుంది. అసలు ఇదంతా అహం, ఇగో.

ఈ పర్సనాల్టీ కల్టు నశించాలి'' అని ఒకాయన ఆస్పత్రికి దూరంగానే చెట్టు కింద ఎవరితోనో చెబుతుంటే పోలీసులు లాక్కెళ్ళి దూరంగా వదిలేసి వచ్చారు.

మునసబుగారతన్ని పిలిచి పోలీసుల్తో మాట్లాడి నచ్చచెప్పడం వలనే ఆ వదలడమయినా జరిగింది. ఆయన వట్టి మునసబుగాదు, ఆయన తమ్ముడు ఆ ప్రాంతంలో పేరుపొందిన పార్టీ మనిషి. మంత్రి కాలేదు కాని, మంత్రుల్ని గుప్పెట్లో ఉంచుకున్నాడు అతను. ఆయన ఇప్పుడు అస్పత్రిలో నాయకుడి ప్రక్కనే కూర్చుని నాయకుడికి బదులు భుజం కదుపుతున్నాడు. సలహాలిస్తున్నాడు – అవసరం అయిన పన్లు చూస్తున్నాడు. మాటిమాటికీ బయటికి వచ్చి ఆకాశం వంక చూస్తున్నాడు. వాన వస్తుందని కాదు, హెలికాప్టరు కనబడుతుందేమో అని.

అవసరమయిన మందులు మరోదేశం నుంచీ అతిజరూరుగా ప్లేన్‌లో పంపారు. అవి రావాలి. హెలికాప్టరు పాడ్ ఆ రోజే అవసరంగా తయారు చేశారు దగ్గరలో ఒక స్కూలు కాంపౌండులో, చదును చేసి నున్నంచేసి.

ఆస్పత్రిలో డాక్టర్లు అందరూ నాయకుని చుట్టూతా కాపుండి ఏ సందులోంచీ యమదూతలు రాకుండా అడ్డం కాస్తున్నారు. ఏ చిన్న కన్నంలోంచీ ప్రాణ వాయువు ఎగిరి పోకుండా చూస్తున్నారు.

ఆ నెలబట్టి ఆస్పత్రిలో మిగతా రోగుల మాట దేవుడే ఎరుగు. డాక్టరు ఎరిగిందల్లా వాళ్ళ ప్రాణాలు దేశాల కంత జరూరుగాదనే. అంతకన్నా వాళ్ళకు తెలిసింది తమ ప్రమోషన్లు ఆ నాయకుని పక్కనే కనుసన్నల్లో మెలిగే మంత్రుల కటాక్షాల మీదనే అని. అందుకే వాళ్ళు మంత్రులు కనురెప్పల క్రిందే కాపరం వుంటున్నారు.

పిల్లల వార్డులో వున్న చిన్నోడు పాపం దిగులుగా ఉన్నాడు. అతని రోగం అంత ప్రమాదమయింది కాదని డాక్టరు కరణంగారికి చెప్పాడు. ఆయన అదే ముక్క మునసబు గారికీ చెప్పాడు. అందుకని కొంచెం జాప్యం అయినా ఫరవా లేదు అని మునసబుగారను కున్నాడు. నాయకుడి విషయం తేలింతర్వాత చూచుకో వచ్చనే అయన అనుకున్నాడు.

ఆస్పత్రి మొత్తం మీద ఒకళ్ళిద్దరు డాక్టర్లు మాత్రం నాయకుడిని పెద్ద వాళ్ళకి వదిలేసి తాము చిన్న వాళ్ళని పట్టించుకొని తిరుగుతున్నారు. అందులో ఓ కుర్ర డాక్టరు మరీని, అతని వాలకం అతని కోలిగ్స్‌కి అంతుపట్టడం లేదు. 'పిచ్చాడని' సరిపుచ్చుకున్నారు.

కుర్ర డాక్టరు చిన్నాణ్ణి చూసి నిట్టూర్చాడు. అవసరంగా అతనికి ఒక మందు పడేస్తే వారంలో తగ్గిపోతుంది. కాకపోతే ఆ మందు ఈ దేశంలో దొరకదు. వేళకి ఆ మందు పడకపోతే ఆ తర్వాత కుదరదని చెప్పలేడు గాని మందు పడితే నిక్కచ్చిగా కుదురుతుందని చెప్పగలడు. నాయకుడికి వస్తున్న మందుల్లో అది వుంది.

నాయకుడెలాగూ బతకడని పెద్ద డాక్టరు చెప్పడం కుర్ర డాక్టరుకి తెలుసు. "చెయ్యగలగిందల్లా చేశామని తృప్తి కోసమే'' అని ఆయన అనడం ఆ చుట్టూవున్న ఇతర నాయకులకూ తెలుసు. అసలు అందరికీ తెలుసు ముసలి

ప్రాణం ఎన్నాళ్ళుంటుంది పోక అని. అయితే ఆ మాట అనగల ధైర్యం ఎవరికీ లేదు. ఈ రోజు ఆ నాయకుడి పట్ల చూపుతున్న ప్రేమ, అభిమానం, అటెన్షన్ ఇవి తరువాత తమకి నిచ్చెన మెట్లవుతాయన్న ఆశే అందరిదీ. ఎన్ని మందులు వాడినా "చివరికి సరిఅయిన మెడికల్ అటెన్షన్ ఆయన కంద లేదని" గొడవ బయల్దేర గూడదన్న ఉద్దేశంతోనే అన్ని ప్రికాషన్లూ తీసుకో పడం జరుగుతోంది.

కుర్ర డాక్టరు పెద్ద డాక్టరుతో చెప్పాడా విషయం. ఆ మందు బోలెడు వస్తుంది కదా, కొంచెం మరో పేషెం టుకు వాడవచ్చునాఅని. పెద్దాయననవ్వి ఊరుకున్నాడు. కొంచెం కోపంగా చూశాడు కూడాను. కాని కుర్ర డాక్టరు ఎంతో నమ్రతగానే అయినా, స్పష్టంగా చెప్పాడు. ఆ చిన్న కుర్రాణ్ణి ఆస్పత్రిలో వదిలేసి తండ్రి వెళ్ళిపోయాడని. అందు కని ఆ భారం తనదే అని. పెద్ద డాక్టరు మాట్లాడలేదు. వెళ్ళిపొమ్మని సౌంజ్ఞ చేశాడు. కుర్ర డాక్టరుకి ఉడుకు మోత్త నం వచ్చింది. కాని ఏం చెయ్యగలడు?

వెంకయ్య చిన్నాణ్ణి వదిలేసి పోతూ డాక్టరు గారికి నాలుగు అనపకాయలు-ఇంత గోంగూర ఇచ్చి - పొలం పన్లు అదును తప్పితే ఏటికేడాది పస్తులు పడు కోవాల్సి వస్తుందనీ-అందుకని కుర్రాడి బాధ్యత చూసుకోండని చెప్పి గుడ్లనీరు కక్కుకుంటూ వెళ్ళిపోయాడు. డాక్టరు కతని చివరి చూపు ఇంకా కళ్ళల్లో మెదుల్తూనే ఉంది. దేశంలో మనుషులు కొందరయినా తమ బాధ్యతను నిర్వ ర్తిస్తునే ఉన్నారు. తనకింత తిండి పెడు తూన్న చెయ్యికింత అసరా ఇవ్వడం తన విధి అని నిశ్చయించుకున్నాడు.

చిన్నాడి పరిస్థితి కొంచెం తారుమార యింది. ఊపిరి అందడంలేదు. బాధపడు తున్నాడు. అక్సిజన్ పెట్టమని సిస్టర్ని కేకేసి చెప్పాడు. స్తంభంలా నిల్చుం దామె. ఆ వార్డుల్లో వున్న ఆరూ నాయ కుడి దగ్గరే 'స్టాండుబై'గా ఉన్నై. అందుబాటులో ఇప్పుడు ఒక్కటీ లేదు.

వెంటనే వెళ్లి తెమ్మని వార్డుబాయ్‌ని పంపాడు. వాడువచ్చి అసలాగది లోకి పోవటానికే భయంగా ఉందని చెప్పాడు. డాక్టరుకి కదలక తప్పలేదు. ఒక్క సిలిండరు కదలడానికి వీల్లేదని డ్యూటీలో ఉన్న తన కోలిగే పట్టు పట్టాడు. ఆయన చుట్టూరా ఉన్న నాయ కులు వత్తాసు వచ్చారు. డాక్టరు ఎంత చెప్పినా వాళ్ళు వినిపించుకోలేదు. "ఆరు సిలిండర్లు కాదు అరవై అయినా ఎటుపోయి ఎటువస్తుందో, రిస్కు తీసు కోవడానికి వీల్లేదు" అని పట్టుపట్టారు. డాక్టరు బయటకి వచ్చాడు చేసేదిలేక.

చిన్నాడిని చూడడానికి వెళ్ళిన కరణం గారు డాక్టరుగారి నడిగాడు, కుర్రాడికి గొట్టం పెట్టాలని సిస్టర్ చెప్పింది. ఎప్పుడు పెడ్తారు?" డాక్టరు చిరాగ్గా "ముసలి నాయకుడున్నాడుగా, వాడు బాల్చీ తన్ననీండి - అప్పుడు" అనేసి వెళ్ళిపోయాడు. కానీ ఎక్కువ సేపు అతనుండ లేక పోయాడు వార్డులో. చిన్నాడు ఎగిరెగిరి పడుతున్నాడు. ఆక్సిజన్ పెడితే అయిదారు గంటలలో అతను ఊపిరందు కుంటాడు. బతికే ప్రాణం, బతకాల్సిన ప్రాణం!

డాక్టరు గబగబా వెళ్ళి అటకాయిం చినవాళ్ళని పక్కకుతోసి ఒక సిలిండరు తీసుకొని వచ్చాడు. 'దేవుడికి చెప్పు

కోండి' అని ఆయన అనడం చాలామంది విన్నారు. నాయకులు కొందరు అడ్డం తగిలారుగాని, కరణంగారు, మునసబుగారు సర్దారు. "పోనిండి, ఈ వార్డేగా, అవసరం అయితే మేం తెస్తాం సిలెండరు". డ్యూటీ డాక్టరు అరిచాడు "చూడు ఫిర్యాదు చేస్తాను" అంటూ.

ప్రాణావసరం అయిన మందులు పెద్ద డాక్టరు చేతిలోకి వచ్చినై. నాయకుడు అపస్మారకం, స్మారకం మధ్యలో ఉన్నాడు. అనుయాయులంతా ఆత్రంగా ఆయన వంక చూశారు. అందర్నీ బయటకి పోయి ప్రార్థన చెయ్యమని చెప్పి ఆయన నాయకుడికి ముందు ఒక ఇంజక్షన్ ఇచ్చారు. నాయకుడిలో రియాక్షన్ వచ్చింది. బయటికి పోతున్న వాళ్లు తొంగిచూశారు. "ఏమిటిదంతా. పన్లు మానేసి నా చుట్టూరా నిల్చున్నారా? పోండి పోండి ఇదేనా మీకు ఇన్నాళ్లూ నేను చెప్పింది? ముసలి ప్రాణం పోక ఏం చేస్తుంది - పోండి" అని మళ్ళీ మైకంలో పడిపోయారు. "ఎంత గొప్ప మనస్సు" అన్నారే కాని ఎవరూ ఆస్పత్రి వదలి పోలేదు.

కుర్ర డాక్టర్ని పిలిచాడు పెద్దడాక్టరు రూమ్‌లోకి. భయంగానే వెళ్ళి కుర్ర డాక్టరు సంజాయిషీ చెప్పబోయాడు. ఆగమని సంజ్ఞ చేశాడు పెద్ద డాక్టరు, చిన్న డాక్టరు చెయ్యి పట్టుకొని తన చేత్తో నొక్కి "నాయకుడి విషయం నీకు తెలీదు. ఆయన నిజంగా ఈ దేశానిక్కావల్సినవాడు" అన్నాడు. కుర్రడాక్టరు చెయ్యి విప్పిచూస్తే తను అడిగిన 'మందులపెట్టి' ఉంది. ఎవరికి చెప్పొద్దు అంటూ పెద్ద డాక్టరు మళ్ళీ 'మంది'లోకి వెళ్ళి పోయాడు.

## శపథం ..... రంగినేని సుబ్రహ్మణ్యం

చిత్రం! ఆకాశం చిల్లిపడిందా?
యుగయుగాల అంతర్మథనం
ఆవిరైందా?
ఉషస్సులోని రోచిస్సు పరువం
పండిందా?
సంధ్య కన్నెర్ర చేసిందా?

ఔనూ, ఇంత బడబానలం ఆవరించిన
దావానలం
గుండెల్లో గూడు కట్టుకుంది,
పూర్వ దిశాంచలాల సంకెళ్లు ఛేదించుకొని
నిశీథాలు చీలుస్తూ నిర్గమిస్తున్న
వ్యథ ఆవేదన ఆవేశం
నన్ను నడిపిస్తున్నాయి! ... ...

వర్షాభ్రంలో నుండి తొంగి చూచే
ఇంద్రచాపాలూ నన్ను మధ్య పెట్టలేవు
తెల్లని మబ్బులలో దోబూచులాడే
చల్లని వెన్నెలలూ సముదాయించలేవు!
ఎప్పుడో - ఏ క్షణంలోనో
అకాల వసంతంలా
సకాల గ్రీష్మాతపంలా
ఒళ్లు విరుచుకొంటాను -
కళ్లు తెరుస్తాను
పిడికిలి బిగిస్తా - అడుగులు నడిపిస్తా.
భ్రమలో పెట్టే గీతాలు నాకు రుచించవు
ఉదయారుణ సత్యాలు రుచించ లేవు.
నన్ను వెన్నంటే ఉషస్సును మధ్యందిన
మార్తాండ తేజస్సుగా
ఓజస్సుతో మారుస్తాను,
ఉర్విని నడిపిస్తానూ - సామాన్యుని
సంశయాలు తీరుస్తాను
సౌఖ్యానికి బాటలు వేస్తాను
ఇదీ నా పథం - శపథం - నా చరిత్ర.

# కన్నడ భాషలో ఏకాంకిక

## చంద్రశేఖర పాటిల్

(ఫిబ్రవరి - మార్చి నెలలలో మద్రాసులో కేంద్ర సాహిత్య అకాడెమీ దక్షిణ భారత విభాగం నిర్వహించిన రచయితల వర్క్‌షాప్‌లో చదివిన వ్యాసానికి సంక్షిప్తం.)

ఈ వేళ మనం నాటకంగా చెప్పే సాహిత్య ప్రక్రియ కన్నడ భాషకు కొత్త. గత కాలపు సాహిత్యంలో నాటకీయమైన ఘట్టాలున్నా నాటకాలు లేవు. యక్షగానం, దొడ్డాట, దొంబరాట మొదలైనవి నాటక ప్రక్రియకు దగ్గరగానే వున్నా, అవి ప్రజాజీవితంలో భాగాలుగా వున్నాయేగాని సాహిత్యంలో భాగంగావు.

శ్రీ సింగరార్య 1700 ప్రాంతంలో శ్రీ హర్షుని రత్నావళిని, "మిత్ర వింద గోవింద" పేరున అనువదించినదే మొదటి కన్నడ నాటకం. 19 వ శతాబ్ది చివరిలోనూ, 20 వ శతాబ్ది ఆరంభంలోనూ సంస్కృతం నుంచీ, ఇంగ్లీషు నుంచీ చాల నాటకాల అనువాదాలూ, అనుసరణలూ కన్నడంలోకి వచ్చేయి.

కన్నడంలో ఆధునిక నాటక రంగం అవతరణకు (బొంబాయి) పార్శీ కంపెనీ, (మహారాష్ట్ర) సాంగ్లీ కంపెనీలు తోడ్పడ్డాయి. అవి ప్రధానంగా పౌరాణికాలూ, చారిత్రకాలనూ ప్రదర్శించేవి. అవన్నీ సుదీర్ఘములే.

ఇంక ఏకాంకికలకు వస్తే 1890 ప్రాంతాలలో శ్రీ ఎస్. వెంకట్రామశాస్త్రి వ్రాసిన "ఇగ్గప్ప హెగ్గడెయ వివాహ ప్రహసన" మును మొదటి కన్నడ సాంఘిక నాటకం అనవచ్చు. శ్రీ టి. పి. కైలాసం, శ్రీ రంగ కన్నడ నాటకానికి కొత్త మలుపు తెచ్చేరు. వీరి చేతుల్లో అది ఒక సాహిత్య ప్రక్రియగానూ, ప్రదర్శన ప్రక్రియగానూ కూడ చాల అభివృద్ధి పొందింది. వీరు ప్రధానంగా పట్టణ మధ్య తరగతుల సాంఘిక, సాంస్కృతిక సమస్యల్ని వస్తువుగా తీసుకొని నాటకాలు వ్రాసేరు. కైలాసానిది సహజమైన హాస్యం. నాటకాలలో కన్నడ, ఆంగ్లభాషల్ని మిశ్రంచేసి వుపయోగించేరు. దానికి ఆయన "కన్నడాంగ్లా" అని నామకరణం చేసేరు. ఈయన కీచక, ఏకలవ్య వంటి చక్కని నాటకాలను పౌరాణిక కథా వస్తువుతో వ్రాశారు.

శ్రీ రంగ నూరు వరకు ఏకాంకికలను (చిన్న నాటికలు అనడం నా అభిమతం) వ్రాశారు. పౌరాణిక కథలను, వర్తమాన పరిస్థితులను సమన్వయించి, ఈయన తమ నాటికలను రూపొందించేరు. నాటక ప్రదర్శనలో అనేక నూతన కల్పనలు తెచ్చేరు. ప్రారంభదశలో వీరు విప్లవాత్మకత కనబరచినా, క్రమంగ యధాస్థితివాదీ, అభివృద్ధి విరోధీగా మారేరు. అయితే వీరు సాహిత్య ప్రక్రియగ కన్నడ నాటకాన్ని ఉచ్చస్థితికి తెచ్చేరు. వీరి పాత్రలు మేధోవిభవాన్ని ప్రదర్శి,

చుతాయేగాని మానవతను కనబరచవు. కైలాసం పాత్రలు మానవత్వ మూర్తులు.

50 వ దశాబ్ది అనంతరం కన్నడ సాహిత్యంలో అబ్సర్డ్ నాటక (అసంబద్ధ అసంగత) ఉద్యమం విస్తరించింది. సాంప్రదాయిక నాటక ప్రభావం నుంచి ఇది నాటక రంగాన్ని విముక్తం చేసింది. డొనెస్కో వ్రాసిన "ది బాల్డ్ ప్రిమ డోన్నా" ను ఎస్. అడిగ "బొక్క తలెయ నర్తకి" గా అనువదించి ఈ పంథాకు నాంది పలికేరు.

అసంగతత్వం జీవిత వాస్తవం. ఈ విశ్వరంగంలో మానవుని నిరీహస్థితి, పరిసరాలతో పొత్తుకుదరని జీవిత రంగంలో ఉద్దేశ శూన్యంగా బ్రతికెయ్యడం, సంక్షుబ్ధ పరిస్థితులలో మానవుని వెంటాడుతూండే ఏకాకిత్వ భావన, తానేమిటో తెలుసుకోవాలనే తపన – ఇవి నూతన పంథా నాటికలకు కథా వస్తువులయాయి. ఇవి రంగం మీద బాగా రక్తి కట్టేయి కూడా. శ్రీ బి. వి. కారంత్ వంటి సమర్థుల కృషి ఫలితంగా కన్నడ నాటక రంగం సృజనాత్మకంగా అభివృద్ధి పొందింది.

శ్రీయుతులు కైలాసం, శ్రీరంగ నాటక రంగానికి ఎంత తోడ్పడ్డారో అంత అపకారమూ కూడ చేసేరు. వారు నాటక కంపెనీలను అపహాస్యం చేసి, నిరుత్సాహ పరచి నాటకరంగం అభివృద్ధికి ఆటంకం కలిగించేరు. అబ్సర్డ్ నాటకం దానిని మరింత ఎక్కువ చేసింది. అది నాటక ప్రదర్శనలకు ఒక దశలో ఉత్తేజం కలిగించినా, ఈనాడు దాని ప్రాభవం తగ్గిందనే చెప్పాలి. అయితే అది నూతన, మరీ నూతన మార్గాల విస్తరణకు దారి తీసింది.

దేశంలో వచ్చిన సామాజిక – ఆర్థిక – రాజకీయ పరిణామాలు రచయితలలో రాజకీయ నిబద్ధతను తెచ్చిపెట్టేయి. సాహిత్యం యిప్పుడు కాలక్షేప ప్రధానం కాదు: జీవితరంగంలో క్రియాశీలం అయింది. జీవితానికి నిబద్ధం అవుతూంది. దిగువ తరగతుల వారి నుంచి ఈ దశలో నూతన ప్రతిభ జాగృతం అయింది. శూద్ర, దళిత వుద్యమాలు, (జె. పి. వుద్యమమూను) ఈనాడు సాహిత్యాన్ని నడుపుతున్నాయి.

ఈనాడు నవరచయితల మీద జర్మన్ నాటక రచయిత బ్రెఖ్టా ప్రభావం ప్రధానంగా వుంది. జానపద రూపాలు ప్రధాన సాధనం చేసుకోబడుతున్నాయి. చంద్ర శేఖర పాటిల్, చంద్ర శేఖర కంబర్, హెచ్. ఎం. చెన్నయ్యా తమ భావాలకు ఈ రూపాలను ప్రధాన వాహికలుగా చేసుకొంటున్నారు.

ఇటీవల నాటక ప్రదర్శన థియేటర్లలో గాక వీధి మూలలలో, ప్రజా సముదాయాలకు ప్రదర్శించే ప్రయత్నం అధికంగా సాగుతూంది. ఆధునిక నియంత (ఎమర్జెన్సీ), సాయిబాబా మోసకారితనం గురించి శ్రీ చంద్రశేఖర పాటిల్ వ్రాసిన రెండు నాటకాలు బాగా ప్రాచుర్యం పొందేయి. శ్రీ సిద్దలింగయ్యా "పంచమ" నాటకం వీధి మూలలలో విశేషంగా ప్రదర్శించబడుతూంది.

ఇది ఔత్సాహిక నాటకరంగం కథ. వృత్తి నాటకరంగం కూడ కన్నడంలో మంచి ఉచ్ఛదశలోనే వుంది.

# 'నా రచనకు ప్రేరణ'

## చర్చావేదిక

జూన్ 4 వ తేదీని పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో "నా రచనకు ప్రేరణ" అన్న విషయం పైని జరిగిన చర్చలో శ్రీ పాండ్రంకి సుబ్రమణి చదివిన వ్యాసంలో "రచనకు ప్రేరణ వుంటుందా, లేదా అన్న విషయం మీద రచయితలను రెండు రకాలుగా విభజించవచ్చు. ప్రేరణ కలిగితేనే రచనా వ్యాసంగం సాగించేవారు కొందరు. అది లేకుండానే చాతుర్యంతో రచనలు మలుస్తూ, పాఠకుల్ని ఉక్కిరి బిక్కిరి చేసేవారు కొందరు" అని చెప్పి, "ప్రఖ్యాత ఆంగ్ల రచయిత సోమర్సెట్ మామ్ ప్రేరణ కలిగితేనే సాహితీ వ్యాసంగం సాగించ వలసివస్తే, జీవితంలో కొద్దిపాటి రచనలే చెయ్యగలం. రచనా వ్యాసంగాన్ని ఒక జీవిత విధానంగా చేసుకోవాలి" అన్నారని ఉదాహరించారు. "రచనా వ్యాసంగాన్ని జీవిత విధానంలో ఒక భాగంగా, నిత్య కృత్యంగా మలచుకొంటే తప్ప సాహిత్యం పెంపొందించలేమని ఆయన ఉద్దేశ్యం. ఆయన గారితో ఎంతమంది ఏకీభవిస్తారో తెలియదు. కాని కథకుడిగా నా అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని ఒకటి చెప్పగలను. ప్రేరణ కలగ చేసిన రచనలకూ, లేకుండా చేసిన రచనలకూ మధ్య, సాహిత్యం అంతే ప్రాణం ఇచ్చే పాఠకుడికి, బోలెడంత వ్యత్యాసం కనిపిస్తుంది.

"ప్రేరణ రచయిత మానసిక దృక్పథానికీ, సామాజిక అవగాహనకూ ప్రతిరూపం మాత్రమే కాదు. సాహితీ నావకు చుక్కాని వంటిది."

తరవాత తమ 'చిరుత' కథకు ప్రేరణనిచ్చిన ఘట్టాన్ని వివరించారు ఒకమారు అనారోగ్యంతో పడివున్న దశలో తనకు వుపచారాలు, ఇంట్లో పనులు, వాకిట్లో అవసరాలు చూస్తూ విపరీతంగా శ్రమ పడుతున్న భార్యను చూసినప్పుడు కలిగిన భావాలు ఆ కథకు ప్రేరణ అన్నారు.

"ఈమె ఎందుకింత శ్రమ పడుతూంది? ఏ సుఖం వుందని ఇంతగా అగచాట్లు పడుతూంది? ఏ స్వల్ప సుఖమో వుందనుకున్నా దానికై ఇంత శ్రమ అవసరమా? వివాహబంధం ఆమెలో ఈ ఓర్పు, కష్ట సహనం నేర్పుతూంది. ఆ బంధంలో పవిత్రత వుందా బానిసత్వం ఉందా అన్నది వాళ్ళవాళ్ల దృక్పథాలను పట్టి వుంటుంది. ఆ బంధం పవిత్రతనూ, మహత్వాన్నీ అందరు గుర్తించాలని నా భావం. ఎక్కడో పుట్టి పెరిగిన మగవాడు, మరో చోట పుట్టి పెరిగిన ఆడది ఒక గూటిలో యావజ్జీవం కలిసి వుండేటట్లు చేస్తూంది ఈ బంధం ఆలోచిస్తే సంసారంలో మగవాని పాత్ర కన్నా స్త్రీ పాత్ర అధికం. అది గమనించక మగవాడు అహంకారంతో సుఖాస్వాదన సాధనంగా మాత్రమే వాడుకొంటున్నాడు. ద్రోహం తలపెడుతున్నాడు. కించ పరుస్తున్నాడు — అని

ంచింది. ఈ భావాల రూప పరికల్పనే
ా "చిరుత" కథ."
తరువాత శ్రీ వాకాటి పెంచలరెడ్డి
న రచనా వ్యాసంగాన్ని ప్రేరేపించి
ది ఒక స్నేహితుని కవ్వింపేనన్నారు–
స్కూల్ ఫైనల్ చదువుతున్న రోజు
లో ఒక మిత్రుడు తాను కథ వ్రాసి
ా పేర పత్రికకు పంపిస్తానన్నప్పుడు
పని నేను చెయ్యలేనా – అనిపించింది.
క వ్యాసం వ్రాసి నెల్లూరు స్థానిక
ారపత్రికకు పంపగా వారు వేశారు.
ప్పుడా వ్యాసాన్ని ఆ పత్రిక వేసి
ుండకపోతే నేను వ్యాసరచనకు గాని,
పద్య రచనకుగాని పూనుకొని వుండే
వాడిని కాను" అన్నారు.

శ్రీ మహీధర రామ మోహనరావు
తమ "కొల్లాయిగట్టితేనేమి?" అన్న
నవల రచనకు ప్రేరణ కలిగించిన
ఘటనలను వివరిస్తూ వ్యాసం చదివేరు.

చివరన జూలై 2న జరిగే గోష్ఠిలో
'అభ్యుదయ' మే, జూన్ సంచికలలోని
వివిధ ప్రక్రియలపై జరుగుతుందనీ,
సభ్యులు వాటిలోని విషయాలపై తమ
అభిప్రాయాలూ, విమర్శలూ వినిపించి,
ప్రతిక అభివృద్ధికి సాయపడాలని విజ్ఞప్తి
చేయబడింది.

## ట్రైబల్ ట్రాజెడీ ....... గౌస్

ఎక్కడా ఎవ్వరూ లేరు
అంతటా ఒకటే నిశ్శబ్దం
వీధి నర్తకి మువ్వలను విసిరి పారేసి
వెళ్ళి పోతున్నట్లు ఆకాశం.
మజిలీల కథలన్నీ విని
మత్తుగా నిద్ర పోతున్నారు.
బాటసారులు
పాదాల బొబ్బలు కొరుక్కుంటూ
కుక్కలా నీచంగా పడివుంది దారి.
పత్తికీ నూనెకూ మధ్య అగాధం
సారాయి దీపం పక్కన
అగ్గిపుల్ల స్పృహ తప్పిపడివుంది.
గాయం చుట్టూ అల్లుకున్న
సాలెగూటి బాధ
ప్రతి ఇంట్లోనూ
విషాద వస్త్రాన్ని
నైపుణ్యంగా
నేస్తున్న మగ్గాల చప్పుళ్ళు
మోకాళ్ళ రాళ్ళపై
శిధిల జీవిత కళాకారులు
శాసనాలు చెక్కుతున్న
ఆలోచనల ఉలుల చప్పుళ్ళు
తల్లులు శిశువుల మృత కళేబరాలను
ఉయ్యాలలూపుతున్నారు -
పిల్లలు కలల్లో
అశ్రువిహంగాలను ఎగరేస్తున్నారు
పొత్తికడుపు మీద
సమాధులు మొలిచిన కన్నెలు
ఎవరూ అద్దెకు తీసుకోని ముఖాన్ని
దుమ్ములోనికి విసిరి పడుకున్నారు.
గుండె చిరిగి కాళ్ళమీద పడుతుంది.
బోనులో కత్తులు పరుగెత్తు తున్నట్లు
గాలి ముక్కలు, ముక్కలుగా
వీస్తోంది.
అనివార్యమైన పాపం
శాపమై వీధుల్లో గస్తీ తిరుగుతోంది.

# మద్రాసులో వీరేశలింగం వర్ధంతి

పొట్టి శ్రీరాములు మెమోరియల్ హాలో 'అభ్యుదయ' అధ్వర్యాన మే 27వ తేదీని జరిగిన వీరేశలింగ వర్ధంతి సభకు శ్రీ పి. విద్యాసాగర్ అధ్యక్షత వహించారు. ప్రధాన ప్రసంగం శ్రీ పి. సదాశివబ్రహ్మం చేశారు.

వీరేశలింగంగారు చిన్ననాటి నుంచీ కనబరుస్తూవచ్చిన, ధైర్య సాహసాలను, పదిమందిని పోగుచేసి సత్యం కోసం పోరాడగల శక్తిని, కార్యదీక్షను సోదాహరణంగా వివరిస్తూ ఆయన ఇల్లా అన్నారు:

ఆయన జనన కాలం నాటి ప్రజల మనస్తత్వాన్ని, వారి జీవితాలను శాసించిన ఆచారాలు, అభిప్రాయాలు, నమ్మకాలను గమనిస్తే వీరేశలింగం సాధించిన భావవిప్లవం బోధపడుతుంది. ఆ రోజులలో స్త్రీలు చదువుకోడం తప్పు. బాల్య వివాహాలు విధి. విధవా వివాహం నిషిద్ధం. వర్ణ వ్యవస్థేగాక అస్పృశ్యతాది నియమాలు కఠిన శాసనాలుగా వుండేవి. మానవత, నీతి నియమాల కంటే మత, బాహ్యకర్మానుష్ఠానమే ఎక్కువ ముఖ్యం. లంచాలు తీసుకోవడం ఉద్యోగ ధర్మం. పరంపరాగతమైన ఆచార సంప్రదాయాలు శంకింప రాని సత్యాలు. కూపస్థమండూక వైఖరి స్వధర్మం. ఈవిధమైన భావాలలో, నమ్మకాలలో నిరక్షరాస్యులకు, విద్వాంసులకు పెద్ద భేదం లేదు.

"అనుక్షణమూ, అయాచితంగా సాక్షాత్కరించే అన్యాయంతో, అసత్యం అసురప్రవృత్తితో ప్రచండమైన పోరుసాగించి, అన్ని వర్గాల ప్రముఖుల ఆగ్రహానికి గురిఅయిన మహామనీషుల శ్రేణికి చెందిన వారు వీరేశలింగం ఆయన లోకం పై పువ్వులు చల్లి లోకం చేత రాళ్లు రువ్వించుకున్నారు.

"ఆయన తన సంస్కరణోద్యమానికి సాహిత్యాన్ని సాధనంగా వినియోగించుకొన్నారు. అయితే సంస్కరణలను సాహిత్యానికి పరిమితం చేయలేదు. "చినుకులయిన లేక పట్టి యురుములతోను, మెరపులతోను సరిపోయె శుష్క మేఘాడంబరము వలెనే క్రియాశూన్యమై చెవులు చిల్లులు పడిపోయెడు వాగాడంబరమ శ్లాఘాపాత్రము కాదు'' అనేది ఆయన అభిప్రా యం. తన ఆశయాలను క్రియారంగంలో తెచ్చేరు. కర్మక్షేత్రంలో ఆయన శక్తి సుప మయింది. ఆనాడాయన బోధించిన మద్య పా నిషేధం, వరకట్న నిషేధం, కన్యాశుల్క నిషే ధం, అస్పృశ్యతానిషేధం, బాల్యవివాహ నిషే ధం, నేడు మన జీవనధర్మాలయాయి— అన్నా శ్రీ సీతారామబ్రహ్మం.

తరవాత శ్రీ డి. ఆంజనేయులు వీరేశలింగ గారి సాహిత్య వ్యవసాయం గురించి ప్రసం చేరు. వివిధ సాహిత్య ప్రక్రియలను ఆయ తమ సంఘ సంస్కరణోద్యమ ప్రచారంలో ఉపాంగాలుగా వినియోగించుకొన్న తీరున వివరించారు. సమాజంలో స్త్రీలకు జరుగుతున అన్యాయాన్ని ప్రతి ఒకరి దృష్టికి తెచ్చి చూపే దుకు 'ఆడమళయాళం' నవలను వీల రూపొందించినదీ శ్రీ ఆంజనేయులు వివరించేర ఉద్యోగులలోని అవినీతి, లంచగొండితన మొదలైన దుర్గుణాలను తూర్పార బడుతే వ్రాసిన ప్రహసనాలు, నాటకాలను పేరొ న్నారు. జనసామాన్యంలో హేతువాదదృక్ప శాస్త్ర విజ్ఞానమూ కలిగించేందుకై వ్రాసిన శా గ్రంధాలను పేర్కొన్నారు.

"ఒకలక్ష్యంతో, సమాజాన్ని సంస్కరించ లనే లక్ష్యంతో ఆయన రచన సాగించారు కలాన్ని కత్తిగా వినియోగించిన వీరుడాయన '

తరువాత "అభ్యుదయ" మార్చి సంచికల శ్రీ అక్కిరాజు రమాపతిరావు వ్రాసిన "వీరే లింగం గారికి జరిగిన అన్యాయం" అ వ్యాసాన్ని శ్రీ భా. సాంబమూర్తి, "అభ్యుదయ జూన్ సంచికలో ఆయనే వ్రాసిన "వీరేశ గాన్ని గూర్చిన విమర్శలు" వ్యాసాన్ని శ్రీ సూర్యమోహన్ చదివేరు. వాటిపై కొంత సే చర్చ జరిగింది. ఈ వ్యాసాలు రెండూ సభ దృష్టిని బాగా ఆకర్షించాయి.

ఓట్టచివర వీరేశలింగంగారి వర్ధంతి స హణలో తమ 'సంస్కృజన'' కూడా వల్లొంటు దని శ్రీమతి హేమలత అంజనేయులు తెలివా

## సమీక్ష

### కొమర్రాజు వేంకట లక్ష్మణరావు

జీవిత చరిత్ర. రచయిత అక్కిరాజు రమాపతిరావు. వెల, రూ. 4-50, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 4 ప్రచురణ.

ఆంధ్ర పునరుజ్జీవనోద్యమ ప్రముఖులు వీరేశలింగం, గురుజాడ, గిడుగు ప్రభృతులలో ఒకరైన కొమర్రాజు లక్ష్మణరావుగారి శత జన్మ దినోత్సవ సందర్భంగా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్కిరాజు రమాపతిరావుగారు వ్రాసిన ఆయన జీవిత చరిత్రను ప్రచురించడం హర్షించవలసిన విషయం.

తెలుగు ప్రజలు ఆధునిక జీవితంలోనూ, సంస్కృతిలోనూ ప్రవేశించి, భూస్వామ్య నాగరికతను విసర్జించడానికి బీజాలు నాటిన వారిలో లక్ష్మణరావుగారొకరు. ఆయనకు ఆంధ్రజాతి ఎంతో రుణపడి వుంది. భూస్వామ్య నాగరికతా, సంస్కృతుల ప్రభావంలో పడివుండి, పెనునిద్దరలో వున్న ఆంధ్రభూమిని మేల్కొల్పిన వీరేశలింగంగారి సర్వతోముఖమైన ఉద్యమానికి చేయూతనివ్వడమే కాక, యీ శతాబ్దారంభంలో ఆ భావాల వ్యాప్తికి విశేషకృషి చేసిన మహావ్యక్తి లక్ష్మణరావుగారు. ప్రభుత్వంకాని, పెద్దసంస్థలు కాని తలపెట్టలేక పోయిన విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు పూనుకున్న ప్రజ్ఞాశాలి, త్యాగపరుడు ఆయన. తెలుగుజాతి నిత్యం స్మరించ వలసిన లక్ష్మణరావు గారి జీవిత చరిత్ర ప్రచురణ, పుస్తక ప్రచురణ కేవలం లాభాల వ్యాపారంగా వుంటోన్న యీనాడు ఎంతో ప్రశంసనీయం. అభ్యుదయ కాముకులయినవారే కొందరు ఆంధ్ర పునరుజ్జీవనోద్యమ మూలపురుషులను యీసడించే రాతలకు తలపడుతూన్న పరిస్థితినిబట్టి చూస్తే యీ పుస్తకమెంతో అవసరమైనది కూడా.

### కడుపు కోత

కథలసంపుటం. రచయిత, దేవరాజు మహారాజు వెల, రూ. 4. ప్రతులకు నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్ బజార్ చౌరస్తా, హైదరాబాద్ - 1

తెలంగాణా మాండలిక శైలిలో రాసిన యీసంపుటంలోని పది కథలూ సరదాగా చదివించడమే కాదు. సమాజంలోని ఏదో ఒక లోపాన్ని చురుక్కు మనిపించేలాగా సున్నితంగా ఎత్తి చూపుతాయి. ఇంతకు పూర్వం యివి వివిధ పత్రికలలో వెలువడ్డాయి. తెలంగాణా నుడికారంలో సొగసులూ, కొంత వరకు ఆ ప్రాంతపు జీవితసరళీ ఈ కథల్లో కనిపిస్తాయి.

## స్వీకారం

నెల వంక

ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల 1977 -1988 సాహిత్య వార్షిక సంచిక.

సారస్వత వేదిక

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించిన సారస్వత కార్యమాల నివేదిక. పై పుస్తకాలకు వెల లేదు. (ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు).

ప్రశ్నే ప్రగతి

కవితలు. రచయిత, రణధీర్. వెల, రూ. 3. (నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్-1.)

### పారిజాతము

చారిత్రక నవల. రచయిత. వక్కలంక లక్ష్మీపతిరావు. వెల, రూ. 6. (వక్కలంక లక్ష్మీపతిరావు, భూపయ్య అగ్రహారం, అమలాపురం.)

### మన చరిత్ర

చరిత్ర గ్రంథం. రెండవముద్రణ. రచయిత, వీటుకూరు బలరామమూర్తి. వెల, రూ. 8. (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-4.)

### చక్రఘోష

కవితలు. రచయిత, గిడుతూరి సూర్యం, వెల, రూ. 2.(గిడుతూరి సూర్యం, ఎం. ఐ. జి. 42 ఎ, కరుణానిధి నగర్, 20 - ఎవెన్యూ, మద్రాసు- 83.)

### పాలికేక

కవితలు. రచయిత, వంగపండు ప్రసాదరావు. వె., రూ. 2. 50. (పి. వి. రమణ, జనరల్ స్టోర్స్, పోర్ట్ ట్రస్ట్, విశాఖపట్నం).

### దేశ దేశాల కథలు

అనువాదకుడు, గాదంశెట్టి శ్రీరాములు. వెల, రూ. 5 (జి. గోవిందలక్ష్మి, తూర్పు బ్రాహ్మణ వీధి, డబ్ల్యు 4 / 205, గూడూరు, నెలూరు జిల్లా.)

ఇతర దేశాలవీ, భారతీయ భాషలవీ 17 కథల అనువాద సంపుటం.

## ★ ★ ★ ★ లేఖలు ★ ★ ★ ★

### 'కఠినమైన విమర్శ'

రచయితలందరు కొత్తవాళ్ళుగా కనిపిస్తున్నారు. అందువల్ల స్థాయి కూడ పడిపోయింది. అంటే పాత వాళ్లనే పట్టుకొని ఊరేగమని నా అభిప్రాయం కాదు. "అభినందనలు" లో ఇదే ధోరణి ఉంది. పట్టి పొగడ్తలు వదలిపెట్టి, వారి రచనా విమర్శలు చేస్తూ పదండి. ప్రతికి ఉన్న కవులకు, కథారచయితలకు సాహిత్యంలో స్థానాలు మనమే కల్పించడం మంచిది కాదు. పాఠకులే ఆ పని చేసుకొంటారు. గ్రూపులు పద్ధతి ఆది నుండి ఉంది. అది ఇంకను కొనసాగడం భావ్యం కాదు, అన్ని దృక్పథాల నుండి విమర్శలు వస్తేనే రచయితలు, ముఖ్యంగా పాత రచయితలు మంచి రచనలు చేయగలరు. పొగడుతూపోతే దప్పటి కప్పుకొని పడుకొంటారు. మీరు "అభినందనలు" లో చేసిన పని అదే. దీనిని నేను వద్దంటున్నాను.

కొత్త రచయితలకు ప్రోత్సాహం ఇవ్వవలసిందే. కాని వాళ్ళు బొత్తిగా చదవడం లేదు. వాళ్ళు వ్రాసేటి వన్నీ అప్రయత్నంగా, చాలామూలా లేకుండా, అనుభూతి పొందకుండా వ్రాసేటివే. వాళ్ల విషయంలో నాకు చాలా నిస్పృహ విర్పడింది. నాకు పంపిన "అభ్యుదయ" (జూన్ సంచిక)లో "ఉదయాద్రి", "నేను కవిని" రచయితలు "నేనుశేస్తేమనిషిని కాను" అంటున్నారు. వీరు లేచేదెప్పుడు? నూరు వసంతాలు గడిచిన తర్వాతనా? "బార్లల్లో బారులు తీరికూర్చున్నారు" అని స్రవంతి అంటున్నాడే. ఈ వాక్యంలో ఏమైనా పస ఉందా? "కలం మరమ్మతు" రచయిత కూడ శ్రీ శ్రీనడకను అనుకరింప జూస్తున్నాడు. ఇతడు ఎప్పుడు వ్రాస్తాడో మరి! "నవత లేని కవిత, కవిత లేని నవత నడ పీనుగులు" అని కత్తి పద్మరావు అంటున్నాడు. మాటలు ఇటువి అటు, అటువి ఇటు మారితే భావమే పూర్తిగా మారిపోతుందని ఇతనికి తెలియదేమో! "పిల్లలేని తల్లి, తల్లిలేని పిల్ల" ఒకటే అవుతాయేమో ఆలోచించండి.

ప్రశంసించదగినది "అడపిల్లలు" కవిత. పది పంక్తులు వ్రాసినా, మనస్సునకు హత్తుకొనేటుచెప్పినాడు కొల్లూరి సూర్యనారాయణమూర్తి. "ఎసాల్ట్ అండ్ రేప్" కథ బాగుంది. ఇతనికి ప్రోత్సాహం ఇవ్వవలసిందే. కాని ఇంగ్లీషు పదాలతో శీర్షిక ఎందుకు? ఇతనికి ఇంగ్లీషు కూడ వచ్చునేమోఅని మనలను భ్రమింపచేయడానికా? రాక్షసత్వం, పశుత్వం, కామాంధత్వం ఇంకా

ఏవేవో మాటలు ఎంచుకొని, వాటిలో ఏదో ఒకటి శీర్షికగా పెట్టకూడదా? శ్రీశ్రీ ఒకసారి "టాగూరు నా ఎల్లర్జీ" అని "తెలుగు స్వతంత్ర"లో వ్రాసినాడు. దానికి అది సరిపోయింది. నగినా తగినట్లు ఉండాలి. చలం ఇంగ్లీషు పదాలు వాడితే, అతనిని అనుకరించమని ఎక్కడైనా ఉందా?

నా విమర్శ కఠినమైనది. ఇది రచయితల మేలుకోరి చేసిందే.

అనంతపురం

ఓబుళ రెడ్డి

## కొన్ని సూచనలు

మూడు నాలుగు నెలలుగా 'అభ్యుదయ' బాగా వస్తోంది. ఇది సాహిత్య పత్రిక కాబట్టి ఎక్కువగా రచయితల మధ్య తిరుగుతుంటుంది. కనుక రచయితల మధ్య పరిచయాలు అధికం చేయడానికి పత్రికలో వాళ్ళ ఎడ్రసులు కూడా ప్రచురిస్తే బావుంటుందేమో.

బాగా ప్రతి సంచికలో 7, 8 గురి కవితలు ప్రచురించేకన్నా ఒకరి లేక ఇద్దరివి చాలా కవితలు ఒకేసారి ప్రచురించడంతో అతడి కవిత్వం పట్ల ఒక అవగాహన ఏర్పడానికి అవకాశముంటుంది.

సోవియట్ భూమిలో సోవియట్ గద్య రచయితల పరిచయాలు వస్తున్నట్లుగా - ఇప్పటి ఈ యువతరానికి సరిగా తెలియని వెనకటి మన కవులూ, రచయితలు, ఇతర కళాకారుల గూర్చి క్లుప్తంగా పరిచయంతో పాటు వారిదే ఒక మంచి రచనను పరిచయంచేస్తే బావుంటుందనిపిస్తోంది సాహిత్య ప్రతిక కాబట్టి పుస్తక సమీక్షల గూర్చి బాగా శ్రద్ధ వహిస్తే బావుంటుంది.

దేవరాజు మహరాజు భువనగిరి

## 'కృష్ణాతీరం', 'తెల్లమొహం'

"కృష్ణాతీరం" నవలను లోగడ రెండు సార్లు చదివాను. 'ఒక పరిశీలన' చదివాక ఈ కామెంట్సు దృష్టిలో పెట్టుకొని తిరిగి చదవాలనిపించింది. నాకు నచ్చింది, ఈ పరిశీలన వ్యాసం.

జాక్ లండన్ కథానిక "తెల్ల మొహం" వంటి కథలను మన పాఠకులకు అందించడం 'అభ్యుదయకే' చెల్లింది. బాగుంది.

ఒక అభిమాని రూర్కెలా

## గత నెల 'అభ్యుదయ'

మల్లాది, మంథాగార్ల కథలు గత నెల సంచికలో చదివాను. మంచి రచయితలు కూడ ఒకొప్పుడు యిలాంటి కథలు ఎందుకు వ్రాస్తారనిపించింది. ఈ రెండు కథలు నన్ను నిరుత్సాహపరిచాయి.

శ్రీ మంథా తన పద ప్రయోగ ధోరణి మార్చుకోవడం చాల అవసరం అని నా వుద్దేశం. ఉపమానాలకీ, భావ ప్రకటనకి ఆయన వుపయోగిస్తున్న పదజాలం చాల జుగుప్సగా వుంటున్నది.

మల్లాది వారి కథ 'ఛాందసుడు'లో తాను చెప్పదలచింది ఏమిటని ఆలోచించాను. రావి శాస్త్రిగారి మాట (జూన్ అభ్యుదయ, 50వ పుట) "రచయిత ప్రతివాడు తాను రాసున్నది ఏ మందికి హానికలిగిస్తుందో, ఏ చెడుకు ఉపకారం చేస్తుందో అని ఆలోచించ వలసిన అవసరం వుంది' అని. మల్లాది వారు ఆ విధంగా ఆలోచించి రాసినట్లు నాకు అనిపించదు.

ఒక పాఠకుడు రాజమండ్రి

## ఇంకో అభిప్రాయం

"ఎస్సాల్ట్ అండ్ రేప్" అనే కథ విప్లవ రచయితల్ని గుర్తు తెస్తూంది. ఆలోచించండి. మీరందరూ చర్చిస్తే బాగుంటుంది. వివరించి వాయనక్కరనేదని వ్రాయడం లేదు.

కె.వి రావు విజయవాడ

